


Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
*Chandamama Buildings*
Vadapalani, Madras - 600 026.



# చందమామ

ఏప్రిల్ **1997**






విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**

**PolioPlus**



# IMMUNIZATION AN ASSURANCE OF GOOD HEALTH TO CHILDREN

## VACCINATIONS When and How Many

| Age to Start Vaccination | Name of Vaccine | Name of Disease | How Many Times |
|---|---|---|---|
| Birth | **BCG** | **Tuberculosis** | Once |
| 6 weeks | **Polio** | **Polio** | Three times with intervals of at least one month |
| 6 weeks | **DPT** | **Diphtheria Pertussis (Whooping Cough) Tetanus** | Three times with intervals of at least one month |
| 9 months | **Measles** | **Measles** | Once |

**Babies should receive all vaccinations by the time they are twelve months old.**

Pregnant women should get themselves vaccinated against Tetanus (TT) twice—in an interval of at least one month—during the later stages of pregnancy.

**HEALTHY CHILD—NATION'S HOPE & PRIDE**

Design courtesy : World Health Organisation




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## ఉత్తమ బహుమతి!

జనవరి 26వతేదీ ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినం వేడుకలలో భాగంగా ఊరేగింపు చివర అందమైన దుస్తులతో, చిరునవ్వులు చిందిస్తూ కొందరు బాలబాలికలు ఏనుగుల మీద వచ్చారు. సాహసకృత్యాలకు సత్కారాలూ, బహుమతులూ అందుకున్న బాలబాలికలు వాళ్ళు. అంతకు రెండురోజుల క్రితం ప్రధాన మంత్రి వాళ్ళకు బహుమతులు అందజేశారు.

ఈ బహుమతుల ప్రదానం, దాదాపు ఇరవై సంవత్సరాల నుంచి జరగడం సంతోషకరమైనదే. కాని, వాటిని మరింత ప్రయోజనకరంగా తీర్చిదిద్దవలసిన అవసరం ఉన్నదని పలువురు అభిప్రాయపడుతున్నారు. ఇది ఆలోచించవలసిన విషయం.

ప్రస్తుతం బహుమతులుగా కొంత నగదూ, పుస్తకాలూ, బొమ్మలూ ఇస్తున్నారు. ఈ బహుమతులు అందుకునే వాళ్ళు ఐదు– పదిహేనేళ్ళ మధ్య ప్రాయం గలవాళ్ళుగానే ఉంటున్నారు. వీళ్ళలో ఎక్కువమంది ధనికకుటుంబాలకు చెందినవారు కారు. అటువంటి వాళ్ళకు ఇవాళ ఒక చేత్తో పుచ్చుకుని మరోచేత్తో ఖర్చుచేసే నగదు బహుమతి కాకుండా - వాళ్ళు తమ విద్యను కొనసాగించడానికీ, ఉన్నత విద్యను అభ్యసించడానికీ ఉపయోగపడే ఆర్థికసహాయం అందజేయడం మరింత మేలు చేస్తుంది!

ఇది– ఎదుటి వారిని రక్షించడానికి తమ ప్రాణాలను సైతం లెక్కచేయకుండా ముందుకు ఉరికే సాహసబాలలకు జీవితాంతం మరిచిపోలేని ఉత్తమ బహుమతి అవుతుంది!

సంపుటి : **100**    ఏప్రిల్ **'97**    సంచిక: **4**

విడిప్రతి : **6.00**    సంవత్సర చందా : **72.00**




CHANDAMAMA

వార్తలు – విశేషాలు:

# పాతమిత్రుల కొత్త సహకారం

ఒక దేశం మరొక దేశంతో సత్సంబంధాలు పెంచుకుని సహకారం అందించినప్పుడు అది ప్రపంచ ప్రజల అభ్యున్నతికి ప్రత్యక్షంగానో పరోక్షంగానో దోహదం చేస్తుంది. పలు దేశాలు తమ మధ్య సహకార సంస్థలు ఏర్పరచుకుని వర్తక వాణిజ్యాల అభివృద్ధికి నూతన మార్గాలు అన్వేషిస్తున్నాయి. ఈ కోవలో ఇటీవల హిందూ మహాసముద్ర ప్రాంతంలో ఏర్పడిన సహకార సంస్థ – ఇండియన్ ఓషన్ రిమ్ అసోసియేషన్. హిందూమహాసముద్ర జలాలను తాకే – దక్షిణ ఆఫ్రికా, మడగాస్కర్, మారిషస్, మొజాంబిక్, టాంజానియా, కెన్యా, ఎమెన్, ఓమన్, ఇండియా, శ్రీలంక, మలేసియా, సింగపూర్, ఇండోనేసియా, ఆస్ట్రేలియా అనే పద్నాలుగు దేశాలు ఈసంస్థలో సభ్యత్వం వహిస్తున్నాయి.

నాలుగేళ్ళ క్రితం మనదేశ పర్యటనకు వచ్చిన దక్షిణాఫ్రికా విదేశాంగ మంత్రి పిక్ బోథా – ప్రప్రథమంగా హిందూమహాసముద్ర ప్రాంత దేశాలమధ్య సహకారం గురించి ప్రస్తావించారు. 1995వ సం॥లో మారిషస్ చేసిన ప్రయత్నం ఫలితంగా ముఖ్యంగా – ఆస్ట్రేలియా, ఇండియా, కెన్యా, మారిషస్, ఓమన్, సింగపూర్, దక్షిణాఫ్రికా ఏడు దేశాల సహకారసంస్థ ఏర్పడింది. ఆ తరవాత మిగిలిన ఏడుదేశాలూ ఈ సంస్థలో చేరాయి.

మారిషస్ రాజధాని పోర్ట్‌లూయిలో మార్చ్ 5వ తేదీ పద్నాలుగు దేవాల విదేశాంగ – వాణిజ్య మంత్రులు సమావేశమై సంస్థ చార్టర్‌ను రూపొందించారు. సభ్యదేశాల మధ్య అవగాహనను కలిగించి, పరస్పర ప్రయోజనకరమైన సహకారాన్ని పెంపొందించడం లక్ష్యంగా ఈ చార్టర్ పేర్కొన్నది. అవకాశాలను పెంచి, పరస్పర ప్రయోజనాలను పెంపొందించుకోవడానికి ఆర్థిక సహకారం ప్రధానం అని ఈ చార్టర్ పేర్కొన్నది.

మరిన్ని వ్యాపార సదుపాయాలను కల్పించడం, అధునాతన వైజ్ఞానిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని పంచుకోవడం, మానవ వనరులను పెంపొందించడం, పర్యాటక శాఖలను విస్తృత పరచడం – మొదలైన పది ప్రణాళికల ద్వారా తన లక్ష్యాలను సాధించడానికి ఈ సంస్థ నిర్ణయించింది. ఈ సంస్థ ప్రధాన కార్యాలయం మారిషస్ నుంచి పనిచేస్తుంది.

అనుకున్నట్టుగానే దీని ప్రయోజనాలను ఆశించి, ఈ సంస్థలో సభ్యత్వం కోసం మరిన్ని దేశాలు ఉత్సాహం చూపుతున్నాయి. అయినా ఈ సంస్థ శక్తివంతంగా, మరింత పటిష్ఠంగా పనిచేయాలంటే సభ్య దేశాల సంఖ్య తక్కువగా ఉండడం మంచిదనీ, ఈ విషయంలో సంయమనం అవసరమనీ పోర్ట్ లూయిలో జరిగిన సమావేశంలో ఇండియా సూచించింది. ఈ సమావేశంలో పాల్గొన్న భారత విదేశాంగ మంత్రి ఐ.కె. గుజ్రాల్ – ప్రాచీనకాలం నుంచే హిందూ మహాసముద్రాన్ని ఆనుకుని వున్న దేశాలమధ్య సముద్ర మార్గాలు ఉండేవనీ, అవి వలసరాజ్యాల ఆధిపత్యం వల్ల విచ్ఛిన్నమయ్యాయనీ, ఇప్పుడు పాత మిత్రులూ, వాణిజ్యభాగస్వాములూ మళ్ళీ కలిశారనీ అన్నారు.





# ఉత్తమకావ్యం

చిత్రదుర్గం అనే రాజ్యాన్ని, కనకసేనుడనే రాజు పాలించేవాడు. కనకసేనుడు స్వయంగా కవి, పండితుడు కనుక, ఆయన ఆస్థానంలో కవులకు, పండితులకు మంచి ఆదరణ వుండేది.

చిత్రదుర్గం ఆస్థానపండితుడైన నరసింహ శర్మ ఉద్దండ పండితుడు. ఎన్నో కావ్యాలను రచించి మహారాజుకు అత్యంత ఆదరణ పాత్రుడయ్యాడు.

ఇలా ఉండగా, ఒకరోజు కవిపండితులు సభలో కొలువుతీరివున్న సమయంలో మహా రాజు నరసింహశర్మవైపు చూసి, "మహాకవీ! గత ఆరు మాసాలుగా మీరు నూతన కావ్య రచనకు పూనుకున్నట్టులేదు. కారణం తెలుసు కోవచ్చునా?" అన్నాడు.

నరసింహశర్మ కాసేపు మౌనంగా వుండి, "ఏముంది, ప్రభూ! ఒకచెంప వృద్ధాప్యం మీద పడుతున్నది. దానికితోడు రాయాలన్న ఇచ్ఛ రోజురోజుకూ నశించిపోతున్నది," అన్నాడు క్లుప్తంగా.

కనకసేనుడు కొద్దిసేపు ఆలోచనా ముద్రలో వుండి, "మీ నూతనకావ్య పఠనం వినకపోతే, నాకు లోకమే శూన్యంగా, నిస్సారంగా తోస్తుంది, నరసింహశర్మా! నెలరోజుల్లో ఉగాది పండుగ వస్తున్నది గదా. ఆరోజుకు మీరు ఒక మహత్తర కావ్యం రచించి, దాన్ని సభలో గానంచేసి సభను మీ కవితారసమాధురిలో ఓలలాడించాలి. ఇది నా అభిలాష!" అన్నాడు.

నరసింహశర్మ ఒక నిట్టూర్పు విడిచి రాజుతో, "ప్రభూ, కోయిల వసంతమాసం లోనే కూస్తుంది. నెమలి వర్ష ఋతువులోనే మేఘాలను చూసి నృత్యం చేస్తుంది. కమలం పగటివేళ సూర్యకాంతి ప్రసరించినప్పుడే వికసిస్తుంది. కలువపువ్వు రాత్రివేళ సుధాకరుడి శీతల కిరణాల స్పర్శకే విచ్చుకుం

రాఘవరాజు పట్టాభిరామరాజు

టుంది. అలాగే, కవి మనస్సు స్పందించి నప్పుడే సహజసిద్ధమైన ఉత్తమ కవిత్వం ఆవిర్భవిస్తుందని, నా నమ్మకం," అన్నాడు.

ఇంతలో రాజీవకృష్ణ అనే యువకవి ఆసనం నుంచి లేచి నిలబడి, "ప్రభూ, నరసింహశర్మగారు చెప్పినట్టు కవికి ప్రేరణ, స్పందన అవసరమే కానీ, అవి లేకుండా కవితా సృష్టి జరగదంటే నేను ఒప్పుకోను. కవిత్వాన్నిఆవిష్కరించడానికి అనువైన వాతావరణాన్ని, ప్రతికవీ తనకు తానే కల్పించుకోవాలని, నా అభిప్రాయం. తమ సోమరితనానికీ, అసమర్థతకూ కవులుపెట్టుకునే ముద్దు పేర్లే స్పందన, ప్రేరణ. అయినా, మేధస్సు ఎంతో వికసించిన మనలను –అంటే మానవులను పక్షులతోనూ, పువ్వులతోనూ పోల్చుకోవడం తగునా? అయినా ఏ పక్షీ, ఏపుష్పం ఎంత శిక్షణఇచ్చినా ఎన్నటికీ కవిత్వం చెప్పలేవు కదా?" అన్నాడు మందహాసంచేసి.

రాజీవకృష్ణ మాటలు నరసింహశర్మపై ఈర్ష్యపెంచుకున్న తక్కిన కవులకు పన్నీటి జల్లులాతోచింది. వాళ్ళు చిన్నగా చప్పట్లు చరిచి అతణ్ణి అభినందించారు.

అయితే, రాజీవకృష్ణ మాటలు నరసింహశర్మ మనస్సును భగ్గుమనిమండించాయి. కోపంతో, అవమానంతో ఆయన మొహం ఎర్రబడింది. ఆయన దిగ్గున తన ఆసనం మీది నుంచి లేచి,"రాజీవకృష్ణా, ఉబుసుపోకకు ఏదో ప్రణయకవిత్వం రాసుకునే నీలాంటి వాడికి, ఉత్తమకవిత్వం ఎలావుంటుందో తెలియదు. అత్యుత్తమ కవిత్వం కవి మెదడులోనుంచి కాదు, హృదయంలో నుంచి పుట్టాలి!" అన్నాడు ఆవేశంగా.



రాజీవకృష్ణనవ్వి, "అయితే కవిత్వంరాయడానికి మెదడు లేకున్నా, హృదయం వుంటే చాలునన్నమాట!" అన్నాడు కొంటెగా.

తక్కిన కవులు వ్యంగ్యంగా నవ్వి, కరతాళ ధ్వనులు చేశారు. రాజీవకృష్ణ మాటలకన్నా కవుల ప్రవర్తన నరసింహశర్మను అమితంగా బాధించింది. ఆయన తీవ్రంగా రాజీవకృష్ణ కేసి చూస్తూ, "ఇంతకూ నువ్వనే దేమిటి? నెలరోజుల్లో అంటే ఉగాది నాటికి కావ్యరచన పూర్తి చేయడం సాధ్యమేనంటావు?" అన్నాడు.

"తప్పకుండా సాధ్యమే!" అన్నాడు రాజీవకృష్ణ చెరగని చిరునవ్వుతో.

"అయితే ఆకావ్యరచనఏదో నువ్వే చెయ్యరాదా?" అన్నాడు నరసింహశర్మ.

అంతవరకూ ఇరువురి వాగ్వాదాన్నీ ఆసక్తిగావింటున్నమహారాజు కల్పించుకుని, "కవి



శేఖరులారా! నేనుపెట్టినగడువులోపల, మీలో ఎవరు ఉత్తమ కావ్యరచన చేస్తారో, వారికి నిండుకొలువులోకనకాభిషేకంచేయించి, ఒక రోజు నా అర్ధ సింహాసనాన్నిచ్చి గౌరవిస్తాను," అన్నాడు.

కవులిద్దరూ, "మహాప్రసాదం, ప్రభూ!" అన్నారు వినయంగా.

ఆరోజు ఇంటికి వచ్చిన నరసింహశర్మ ప్రసన్నంగా లేకపోవడం, భార్య శాంతసుందరి గ్రహించింది. ఆయన పరధ్యానంగానే రాత్రి భోజనం చేసేందుకు కూర్చున్నాడు. రాజీవ కృష్ణ హేళనాపూర్వకమైన మాటలే, ఆయన చెవుల్లో మార్మోగసాగాయి. శాంతసుందరి,భర్త పక్కన కూర్చుని విసనకర్రతో విసురుతూ, "మీరేదో వ్యాకులతతో వున్నట్టున్నారు. సభలో రాజుగారు ఏమైనా అన్నారా?" అని అడిగింది.

ఆసమయంలో పక్కింటి నుంచి తిరిగి వస్తున్న నరసింహశర్మ కుమార్తె మాధవి, తల్లి మాటలు విని ఫక్కుమని నవ్వి, "నాన్న గారినిమందలించే ధైర్యం మహారాజు కెక్కడి దమ్మా? రాజుగారి సభలో నాన్నగారు చెప్పిందే కవిత్వం, రాసిందే కావ్యం. కదు, నాన్నా?" అన్నది గారాలుపోతూ.

ఆయన పైడిబొమ్మలా మెరిసిపోతున్న తన కుమార్తెకేసి లాలనగా చూస్తూ, "నువ్వన్నది నిజమే,తల్లీ. ఈ రోజు రాజీవకృష్ణ అనే కుర్రకవి నాతో కావ్యరచనకు పోటీపడ్డాడు," అంటూ, ఆరోజు జరిగినదంతా వివరించాడు.

రాజీవకృష్ణ ప్రసక్తి రాగానే మాధవి ముఖం ప్రసన్నమైంది. తండ్రివెంట రాజసభకు వెళ్ళిన సందర్భాల్లో, ఆమె ఒకటి రెండుసార్లు అతడి ఆసుకవిత్వం విని పరవశించి పోయింది. అతడి స్ఫురద్రూపం ఆమెను అమితంగా ఆకర్షించింది. అయితే, తన తండ్రిలాంటి మేధావితో, ఆయువకవి పోటీపడడం ఆమెకు చిరుకోపం తెప్పించింది. ఇప్పుడు మాధవి నిర్లక్ష్యంగానవ్వి, "మీతో ఆ రాజీవకృష్ణ పోటీకి దిగడం, కొండతో పొట్టేలు ఢీకొన్నట్టుంది, నాన్నా!" అన్నది.

నరసింహశర్మ గంభీరంగా తలపంకించాడు. ఆయన భోజనం ముగించి, తాటాకుల బొత్తి,గంటంతీసుకుని కావ్యరచనకు శ్రీకారం చుట్టాడు. 'జీవనవలయం' అనిపేరు పెట్టాడు. మానవజీవితంలోని వివిధ దశల్ని ప్రకృతితో పోల్చుతూ, ఆయన కావ్యరచన సాగింది. ఉదయాన్ని బాల్యంగాను, మధ్యాహ్నాన్ని యవ్వనంగాను, సాయంత్రాన్ని వృద్ధాప్యంగాను ఆయన అద్భుతంగా చిత్రీకరించాడు.

మొత్తానికి రేయింబవళ్ళు శ్రమించి అనుకున్న గడువుకు కావ్యాన్ని పూర్తిచేయగలిగాడు. ఆయనకు ఎనలేని తృప్తి కలిగింది.

తర్వాత భార్యను, కుమార్తె మాధవిని వెంటబెట్టుకుని, ఉగాదిరోజు ఉదయం నరసింహశర్మ రాజసభకు చేరుకున్నాడు. అప్పటికే రాజీవకృష్ణ, తక్కిన కవిపండితులు, కొంతమంది పురప్రముఖులు సభలో ఆశీనులైవున్నారు. రాజీవకృష్ణ, మాధవి వైపు చూసి మందహాసం చేశాడు. మాధవి కూడా రాజీవకృష్ణను కన్నులతోనే కుశలప్రశ్నలు వేసి ముసిముసిగా నవ్వింది.

ఇంతలో మహారాజు సభాప్రవేశం చేయడంతో, అంతా తమతమ స్థానాల నుంచి వినయంగా లేచి నిలబడ్డారు. మహారాజు సభను ఒకసారి కలయజూసి, "ఈరోజు ఉగాది పర్వదినంగదా!ఇప్పుడు నరసింహశర్మ, రాజీవకృష్ణలు నూతన వత్సరానికి స్వాగతం పలుకుతూ, తమ కావ్యపఠనంతో మనలను అలరిస్తారు," అని ముగించాడు.

నరసింహశర్మ ఒకసారి గొంతు సవరించుకుని, కావ్యాన్ని మధురంగా గానం చెయ్యసాగాడు. ఆయన ఒక్కొక్క పద్యాన్ని భావయుక్తంగావిరిచి చదువుతూంటే మహారాజుతో పాటు కవిపండితులు, పురప్రముఖులుఅంతా మంత్రముగ్ధులయ్యారు. కావ్యగానం పూర్తి కాగానే సభాప్రాంగణం కరతాళ ధ్వనులతో మారుమోగింది.

తర్వాత రాజీవకృష్ణ వంతు వచ్చింది. అతడు సంచిలోంచి తాళపత్రాలబొత్తిని తీసి, మహారాజును సమీపించి ఆయన కందించాడు. ఆయన ఆపత్రాలను పరిశీలించిచూసి,



అందులో ఒక్క అక్షరం కూడా కనిపించకపోవడంతో, రాజీవకృష్ణ కేసి చూసి, "ఇదేనా నువ్వు రచించిన మహాకావ్యం?" అన్నాడు కళ్ళెర్రచేసి.

రాజీవకృష్ణ నోరు మెదపకుండా చిరునవ్వుతో నిలబడ్డాడు. అది చూసి మహారాజు ఆలోచనామగ్నుడయ్యాడు. కాసేపటికి ఆయనలో ఒక ఊహ తళుక్కుమన్నది. వెంటనే రాజీవకృష్ణకేసి ఆప్యాయంగా చూస్తూ, "మొత్తం మీద నరసింహశర్మచేత ఒక మహోన్నత కావ్యాన్ని సృష్టింప చేసిన ఘనత, నీదేనయ్యా," అన్నాడు.

పక్కనేవున్న మంత్రిధీరమతికల్పించుకుని, "ప్రభూ! రాజీవకృష్ణ,నరసింహశర్మ చేతఉత్తమ కావ్యాన్నిఎలా రాయించగలిగాడో నాకుఅర్థం కాకుండావుంది," అన్నాడు ఆశ్చర్యపోతూ.

మహారాజు మందహాసం చేసి, "రాజీవకృష్ణకు, తనకవితాపాటవం ఏపాటిదోతెలుసు. అయినా నరసింహశర్మలాంటి ఉద్దండుడితో పోటీపడ్డాడు. ఎందుకని? నరసింహశర్మలోని కవితా సరస్వతిని మేల్కొల్పాలని! ఎప్పుడైతే ఆస్థానంలోతనకు పోటీ ఏర్పడిందో, అప్పుడు నరసింహశర్మలోని కవితాసముద్రంకెరటాలై పొంగి మనలనురసవాహినిలో ముంచెత్తింది," అన్నాడు.

ఆ వెంటనే నరసింహశర్మ, రాజీవకృష్ణను సమీపించి,"రాజీవకృష్ణా,నిన్నుఅపార్థంచేసుకున్నందుకు విచారిస్తున్నాను," అన్నాడు.

"మీచేత ఉత్తమకావ్యం రాయింపచేయాలనే సదాశయంతో, సభలో మిమ్మల్ని పరుషంగా మాట్లాడాను. ఇప్పుడు సభాముఖంగా క్షమాపణ చెప్పుకుంటున్నాను," అన్నాడు రాజీవకృష్ణ వినయంగా.

తర్వాత నరసింహశర్మకు అత్యంత వైభవంగా కనకాభిషేకం జరిగింది. మహారాజు ఆయనకు తన అర్థసింహాసనాన్నిచ్చి గౌరవించాడు.

రాజీవకృష్ణ మాధవిల ఓరచూపులు, దోరనవ్వులు పసిగట్టిన మహారాజు, "నరసింహశర్మా, ఈ శుభసమయంలో మరొక శుభకార్యానికి నిర్ణయం తీసుకుంటే బావుంటుందని, నా అభిప్రాయం," అన్నాడు

"అదేమిటో శెలవివ్వండి," అన్నాడు నరసింహశర్మ.

"రాజీవకృష్ణను మీ అల్లుణ్ణి చేసుకుంటే, మీకుకవితారచనలో చేదోడువాదోడుగా వుంటూ కావలసినంత ప్రేరణ అందిస్తాడు. కదా!" అన్నాడు మహారాజు గుంభనంగా నవ్వుతూ.

"రాజీవకృష్ణను వివాహమాడడం నీకు ఇష్టమేనా, తల్లీ?" అని అడిగాడు కుమార్తెను నరసింహశర్మ.

"అంతా మీఇష్టం, నాన్నా!" అన్నదిమాధవి ముసిముసిగా నవ్వి.

అప్పుడు నరసింహశర్మ, రాజీవకృష్ణ కేసి చూస్తూ "ఏమయ్యా, మరి నీమాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"తల్లి దండ్రులులేనిఅనాథను. ఒక సాధారణ కవినికోరి ఇంతటి భాగ్యం వరిస్తుంటే, కాదంటానా!" అన్నాడు రాజీవకృష్ణ హర్షాతిరేకంతో.

కాబోయే వధూవరులను కవిపండితుల సభ కరతాళధ్వనులతో అభినందించింది.





# సుల్తాను ప్రశ్నలు

ఒకనొక సుల్తాను, హుస్సేన్ అనే మిత్రుడితో కలిసి అడవి మార్గం గుండా వెళుతున్నాడు. వాళ్ళముందు కొంతదూరంలో మరొక మనిషి నడుస్తున్నాడు.

సుల్తాను మిత్రుడితో, "హుస్సేన్! అదిగో, ఆ వెళుతూన్న మనిషిని గురించిన వివరాలేవైనాచెప్పగలవా?" అనిఅడిగాడు ఉత్సాహంగా.

హుస్సేన్ వెళుతూన్న బాటసారిని కొంత సేపు పరిశీలనగా చూసి, "ప్రభూ! అతడొక వడ్రంగి అయివుంటాడు!" అన్నాడు.

"మరి, అతడి పేరేమిటో చెప్పగలవా?" అని అడిగాడు సుల్తాను.

"బహుశా అతనిపేరుకూడా హుస్సేన్ అయి వుండవచ్చు, ప్రభూ!" అన్నాడు మిత్రుడు.

"అంటే, లోగడే ఆ మనిషి నీకు తెలుసు నన్నమాట! అంతేనా?" అన్నాడు సుల్తాను.

"లేదు ప్రభూ! అతన్ని నేనిప్పుడే చూస్తు న్నాను!" అన్నాడు మిత్రుడు.

"మరి, అతని పేరెలా చెప్పగలిగావు?" అని అడిగాడు సుల్తాను ఆశ్చర్యంతో.

"తమరు నన్ను పేరుపెట్టి పిలిచినప్పుడు, ఆ బాటసారి ఇటుకేసి తలతిప్పి చూడడం నేను గమనించాను. అందువల్ల అతనిపేరు కూడా నా పేరే అయివుంటుందని ఊహించాను," అన్నాడు మిత్రుడు.

"శభాష్! నీ సమాధానం యుక్తియుక్తంగానే ఉన్నది. మరి, అతడు వడ్రంగి అని ఎలా చెప్ప గలిగావు?" అని అడిగాడు సుల్తాను.

"ప్రభూ! అతడు నడుస్తూన్నప్పుడు పళ్ళూ, పువ్వులూ నిండిన చెట్లకేసి చూడకుండా, బోదెలు లావుగా ఉన్న ఎత్తయిన చెట్లకేసి అంటే, కలపకు పనికివచ్చే చెట్లకేసి మాత్రమే చూస్తూ వెళ్ళడం గమనించాను. అందువల్ల అతడి వృత్తి వడ్రంగం అయివుంటుందని ఊహించాను!" అని సమాధానమిచ్చాడు మిత్రుడు.

ఎస్. రవిచంద్రప్రసాద్

"అహా! చాలాగొప్ప పరిశీలన! నువ్వుమహా మేధావివి. నీమేధాసంపత్తినీ, పరిశీలనాశక్తినీ పరీక్షించడానికి మరొక ప్రశ్న! ఆ వెళుతూన్న వ్యక్తి కొంతసేపటికి ముందు ఏం భుజించాడో చెప్పగలవా?" అని అడిగాడు సుల్తాను.

బాటసారిని కొంతసేపు పరిశీలనగా చూసిన తరవాతమిత్రుడు, "కొంతసేపటి క్రితం అతడు తేనెగాని, మరేదో తియ్యటి ఫలహారాన్నిగాని భుజించి ఉంటాడు ప్రభూ!" అన్నాడు.

"అలాగా! ఆ విషయం అతన్నే అడుగుదాం!" అంటూ సుల్తాను చప్పట్లు చరిచి బాటసారిని దగ్గరికి పిలిచాడు. అతడు సమీపించగానే సుల్తాను తన మిత్రుణ్ణి చూపి, "ఇతడిని నువ్వుఎరుగుదువా?" అనిఅడిగాడు.

"ఎరగను," అన్నాడు బాటసారి.

"మిత్రమా! ఇప్పుడు నేను మూడు ప్రశ్నలడుగుతాను. దాపరికంలేకుండా సమాధానాలు చెప్పగలవా?" అని అడిగాడు సుల్తాను.

"చిత్తం, అలాగే చెబుతాను," అన్నాడు బాటసారి.

"నీ పేరేమిటి? నీ వృత్తి ఏమిటి? కొంతసేపు క్రితం నువ్వేం భుజించావు?" అనిఅడిగాడు సుల్తాను.

"నా పేరు హుస్సేన్; నేనొక వడ్రంగిని; అరగంట క్రితం స్వచ్ఛమైన తేనె తాగాను," అన్నాడు బాటసారి.

"నీ సమాధానాలకు చాలా సంతోషించాను," అంటూ సుల్తాను తన చేతికున్న బంగారుకడియం తీసి బాటసారికి అందించాడు.

బాటసారి దానిని తీసుకుని పరమానందంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత సుల్తాను మిత్రుడికేసి తిరిగి, "అతడు తేనె తాగాడని ఎలా గ్రహించావు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"అతడు మాటిమాటికి పెదవులను చేత్తో తుడుచుకోవడం, నోటి దగ్గరికి వాలుతూన్న తేనెటీగలను చేత్తో తరుముతూ ఉండడం చూశాను; కాబట్టి ఏదో తీపి పదార్థం తిని ఉంటాడని ఊహించాను. ఈప్రాంతంలో తేనె పుష్కలంగా లభించడంవల్ల అతడు తేనెతాగి ఉంటాడని గ్రహించాను!"అన్నాడు హుస్సేన్.

"మిత్రమా! నీ పరిశీలనాశక్తి అద్భుతం! నీ మేధాసంపత్తి మహాద్భుతం!" అంటూ సుల్తాను మిత్రుణ్ణి ఆనందంతో కౌగిలించుకున్నాడు.





# సామ్రాట్ అశోక

4

[వృద్ధుడైన బిందుసార మహారాజు అనారోగ్యానికిలోనయ్యాడు. గ్రీకుల ప్రోద్బలంతో తక్షశిలలో తిరుగుబాటు ఆరంభమైనట్టు రాజుకు వార్త అందింది. ప్రధానమంత్రి సలహామేరకు రాజు తన ఆరుగురు కుమారులను పిలిపించి, తక్షశిల తిరుగుబాటును అణచడానికి వెళ్ళే సైన్యానికి నాయకత్వం వహించడానికి ఎవరు సిద్ధంగా ఉన్నారు – అని అడిగాడు. తండ్రి ఆజ్ఞను పాటించడానికి అశోకుడు ముందుకువచ్చాడు. –తరవాత]

ఆరోజు సాయంకాలం యువరాజు అశోకుడు, తమ సేనాధిపతిని చూడడానికి వెళ్ళాడు. అప్పటికే సేనాధిపతికి, ప్రధాన మంత్రి ద్వారా తక్షశిల తిరుగుబాటు గురించి తెలియడంతో, ఆయన సైన్యాన్ని సమాయత్తం చేసేపనిలో నిమగ్నుడై ఉన్నాడు. ఆయన అశోకుణ్ణి చూడగానే నమస్కరించి, "యువ రాజా! నేనూ మీతోపాటు తక్షశిలకు వస్తాను," అన్నాడు.

"మీ అభిమానానికి సంతోషం. అయినా, రాజుగారు అనారోగ్యంతో ఉన్నప్పుడు, తమరు రాజధానిలోనే ఉండడం అవసరం కదా! కాబట్టి మీరు ఇక్కడేవుండి, విశ్వాసపాత్రులైన ఇద్దరు సేనానాయకులను నాతో పంపండి. అదే చాలు," అన్నాడు అశోకుడు.

"మీరన్నదీ నిజమే. ఇటువంటి పరిస్థితిలో రాజధానిలో మహారాజుగారి పక్కన నేను ఉండడం మంచిదే. మీ నిర్ణయం



అభినందనీయం. మన సైన్యంలోని ఉత్తమ దళాలనూ, సమర్థవంతులైన దళపతులనూ మీ వెంట పంపుతాను. అందుకు కావలసిన ఏర్పాట్లు అప్పుడే ప్రారంభించాను," అన్నాడు సేనాధిపతి.

"చాలా సంతోషం," అంటూ అశోకుడు అక్కడినుంచి బయలుదేరాడు.

అప్పటికప్పుడే సైనిక సన్నాహాలు ఆరంభ మయ్యాయి. రాజభవనం ఎదుటవున్న విశాలమైన మైదానంలో ఏనుగులూ, గుర్రాలూ బారులుతీరి నిలిచాయి. సైనికులు ఆయుధాలనూ, అవసరమైన ఇతర పరిక రాలనూ సిద్ధం చేసుకోవడంలో లీనమైపో యారు.

ఈ ఏర్పాట్లన్నిటినీ చూసేసరికి రాజుగారి జ్యేష్ఠకుమారుడైన సుశేముడికి అసూయ పుట్టుకొచ్చింది. అతడు రహస్యంగా సేనాధి పతి దగ్గరికి వెళ్ళి, "ఎక్కడో జరిగే చిన్న అలజడిని అణచడానికి మరేదో మహా యుద్ధానికి వెళుతున్నట్టు ఇంత హంగామా, ఇన్ని ఏర్పాట్లు అవసరమా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఒక్క క్షణం నివ్వెరపోయిన సేనాధిపతి, "యువరాజా! శత్రువుల బలాన్ని తక్కువగా అంచనావేయడం ఏమాత్రం మంచిది కాదు. చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టాలి. అయినా, ఈ తిరుగుబాటుకు వెనక వున్న గ్రీకులు యుక్తిపరులు, వివేక వంతులు, ధనవంతులు. స్థానికులు మన లను ఎదిరించగల శక్తిసామర్థ్యాలను వాళ్ళు సమకూర్చగలరనడంలో సందేహం లేదు. పైగా యువరాజు అశోకుడు ప్రప్రథమంగా సైన్యానికి నాయకత్వం వహించి వెళుతు న్నాడు. ఆయన విజయానికి కావలసిన సకల సదుపాయాలూ చేయవలసిన బాధ్యత నా మీద ఉన్నది. ఇది రాజకుటుంబ గౌరవానికి సంబంధించిన విషయం కదా!" అన్నాడు.

"ఎవరి గౌరవం గురించి నువ్వు మాట్లాడు తున్నావు? మగధసామ్రాజ్యానికి కాబోయే మహారాజు అశోకుడి గౌరవం గురించేనా?" అన్నాడు సుశేముడు వెటకారంగా.

"ఈ రాజ్యానికి కాబోయే రాజు తమరనీ, అశోకుడు కాదనీ విన్నాను. తక్షశిల కేసి తమరే సైన్యాన్ని నడిపి ఉండవచ్చు. తమకు కాబోయే రాజు మొదటివిజయాన్నీ చేపట్టి రావడం చూసి మగధ ప్రజలు ఆనందించి ఉండేవారు. మీరు ప్రజాభిమానాన్నీ, గౌరవాన్నీ చూరగొనడానికి అది ఉపకరించి ఉండేది.

గొప్ప అవకాశాన్ని జారవిడుచుకున్నారు!" అన్నాడు సేనాధిపతి వినయంగా.

"సేనాధిపతీ! నువ్వు నా వెంట ఉంటే నేను జయప్రదంగా తిరిగిరాగలను!" అన్నాడు సుశేముడు కంఠస్వరాన్ని కొద్దిగా తగ్గించి.

"యువరాజా! తమరు చెబుతున్నదేమిటో నాకు అర్థం కావడం లేదు," అన్నాడు సేనాధిపతి.

"సేనాధిపతీ! మాతండ్రి అనంతరం మగధ రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించబోయేది నేను అన్న సంగతి నీకు తెలుసు. కాబోయే రాజునైన నేను, ప్రజలముందు గౌరవంగా కనిపించడానికి సహకరించవలసిన బాధ్యత సేనాధిపతిగా నీకున్నది కదా?" అన్నాడు సుశేముడు.



"తమరు చెబుతన్నదేమిటో నాకు ఇంకా అంతుచిక్కడం లేదు యువరాజా! అయినా, తక్షశిలకేసి సైన్యాన్ని నడిపించే బాధ్యతను తమరెందుకు స్వీకరించలేదు?" అని అడిగాడు సేనాధిపతి.

"ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. నేనే సైన్యానికి నాయకత్వం వహించి నడిపిస్తాను. అందుకు నీ సాయం కావాలి. నేను చెప్పినట్టు చేశావంటే, నేను రాజునయ్యాక నువ్వు కోరిన కోరిక తీరుస్తాను. అందుకు నువ్వు చేయవలసిందల్లా ఒక్కటే. ఈసైనిక చర్యలో అశోకుడు పరాజయం పాలవ్వాలి. ఆ తరవాత నేను సైన్యానికి నాయకత్వం వహించి తక్షశిలకు వెళ్ళి నీ సాయంతో లక్ష్యం సాధించి, జయప్రదంగా రాజధానికి తిరిగి రాగలను. దాంతో ఆ పరిచారిక పుత్రుడైన అశోకుడి గర్వం అణగారి పోతుంది. అందుకు నువ్విప్పుడు బలహీనమైన సైనిక దళాలను అశోకుడి వెంట పంపాలి. అతడి వెంట నువ్వు వెళ్ళకూడదు. ఇద్దరు పనికిరాని దళపతులు వెళ్ళాలి. మన పథకం ఫలించడానికి ఇదొక్కటి చాలు. ఈ విషయంలో నిన్ను నేను నమ్ముతున్నాను. ఇది మన ఇద్దరి మధ్య రహస్యంగా ఉండిపోవాలి. తెలిసిందా?" అన్నాడు సుశేముడు.

సేనాధిపతికి దిగ్భ్రాంతితో నోట మాట రాలేదు. నిశ్చేష్టుడయ్యాడు. కాని దానిని గ్రహించని సుశేముడు, "నువ్వు ఈ పని చేశావంటే దానికి తగిన బహుమతిని ఇస్తాను. మన రాజ్యంలో మునుముందు నీకు లేని అధికారం అంటూ ఉండదు. మహారాజుకు తరవాత, అంటే నాకు తరవాత నీకే అన్ని ఉన్నత అధికారాలూ ఉంటాయి! ఏమంటావు?" అన్నాడు.



"యువరాజా! తమరు నా రాజభక్తినీ, నిజాయితీనీ పరీక్షించడానికి ఇలా మాట్లాడుతున్నారనుకుంటాను!" అన్నాడు సేనాధిపతి.

"అదేంకాదు. అశోకుడి గర్వం అణచాలి. అదే నా ఆశయం. నేను చెప్పింది అక్షరాలా నిజం. అణుమాత్రం సందేహం లేదు," అన్నాడు సుశేముడు దృఢంగా.

"అలాగా! అయితే వినండి– మీ కోరిక నాకుదిగ్భ్రాంతిని కలిగిస్తున్నది. రాజద్రోహానికీ, వెన్నుపోటుకూ నేనెన్నడూ పాల్పడను!" అన్నాడు సేనాధిపతి.

సుశేముడు ముఖం చిన్నబుచ్చుకుని, "అంటే, నా ఆజ్ఞను పాటించనంటున్నావు. అంతేనా?" అని గద్దించాడు.

"ముమ్మాటికీ పాటించను!" అన్నాడు సేనాధిపతి.

'అలాగా! అయితే వేరొక సేనాధిపతిని నిర్ణయించక తప్పదు!" అన్నాడు సుశేముడు.

"అది తమరు మహారాజు అయ్యాక ఆలోచించవలసినవిషయం. అయినా, రాజకుటుంబంలోనే ఇటువంటి కుట్రలు బయలుదేరితే రాజసింహాసనం ఎంతకాలం నిలుస్తుంది! యువరాజా, దయచేసి నా సలహా..." అని ఇంకేదో చెప్పబోయాడు సేనాధిపతి.

"నీ సలహా నాకవసరం లేదు. నీ దగ్గరే ఉంచుకో," అంటూ సుశేముడు అక్కడి నుంచి ఆగ్రహంతో వెళ్ళిపోయాడు.

సుశేముడి దురాలోచనకు బాధపడిన సేనాధిపతి, ఆ తరవాత కర్తవ్య నిర్వహణకు పూనుకుని, తన ప్రత్యక్ష పర్యవేక్షణలోనే సైనికదళాలను సిద్ధం చేశాడు.

మరునాడు తెల్లవారక ముందే అశోకుడు సైనికదళాలతో తక్షశిలకు బయలుదేరాడు. అశోకుడి వెంట కొంతదూరం వచ్చిన సేనాధిపతి, "యువరాజా! మీ ప్రయత్నం జయప్రదం కావాలని కాంక్షిస్తున్నాను. దానిని మీరు సునాయాసంగా సాధించగలరన్న నమ్మకం నాకున్నది. మరొక ముఖ్యవిషయం; మీకు అంగరక్షకులుగా పన్నెండుమంది సైనిక యోధులను నియమించి ఉన్నాను. అయినా మీ రక్షణ విషయంలో మీరు జాగ్రత్తగా ఉండాలి. జయప్రదంగా తిరిగి వచ్చాక, మీకు మరికొన్ని విషయాలు చెబుతాను," అని చెప్పి వీడ్కోలు పలికాడు.

ఆరోజు సాయంకాలం బాగాపొద్దుపోయాక అశోకుడి సేనలు తక్షశిల నగర పొలిమేరను చేరాయి. అక్కడున్న ఒకకొండ పాదతలంలో సైనికులు గుడారాలు వేసుకుని శిబిరం



తిరుగుబాటునాయకులు తమ కోరికలు తెలియజేయడానికి కొంత కాలవ్యవధి కావా లన్నారు. రాయబారులు సరేనన్నారు.

తిరుగుబాటునాయకుల వద్దకు రాయ బారులు వెళ్ళిన తరవాత, అశోకుడి ఆనతి ప్రకారం వందలాదిమంది సైనికులు యాత్రీ కులుగా, వ్యాపారులుగా, బిక్షగాళ్ళుగా వేషాలు వేసుకుని గుట్టుచప్పుడు కాకుండా నగరంలో ప్రవేశించి తిరుగుబాటుదారుల చర్యలను గమనించసాగారు.

ప్రతిరోజూ పొద్దుగూకిన తరవాత తిరుగు బాటుదారులు, తమ గ్రీకుపోషకులను ఒక భవనంలో కలుసుకుని సంప్రతింపులు జర పడం వారు ఏర్పాటుచేసుకున్న పద్ధతి. ఆ పద్ధతి ప్రకారం ఆనాటి రాత్రి కూడా వాళ్ళు అదే భవనంలోచేరి రహస్యంగా పథకాలు ఏర్పరచుకున్నారు. మరునాడు తెల్ల వారగానే అశోకుడు, తిరుగుబాటుదారులకు సందేశా న్నిచ్చి రాయబారులు కొందరిని తక్షశిల నగరానికి పంపాడు.

అప్పటికే తిరుగుబాటుదారులు మగధ రాజప్రతినిధులను నగరం నుంచి తరిమి కొట్టారు. మరికొందరిని చంపివేశారు. ఇప్పుడు తక్షశిల పూర్తిగా తిరుగుబాటుదారుల అధీ నంలో ఉన్నది.

రాయబారులు తిరుగుబాటుదారులను కలుసుకుని, "మహారాజుగారు అస్వస్థతగా ఉన్నారు. ఈ కాలఘట్టంలో సమస్య ఎటు వంటిదైనా సరే, దానికి శాంతియుత పరిష్కా రాన్నే కోరుకుంటున్నారు. మీ కోరికలేవో తెలియజేస్తే, రాజుగారు వాటిని పరిశీలిస్తారు!" అని తెలియజేశారు.

ఆలోచించే విషయం అశోకుడికి తెలియ వచ్చింది. ఆయన సలహా ప్రకారం మారువే షాలలో ఉన్న సైనికులు ఆ భవనాన్ని చుట్టు ముట్టారు. ఆ తరవాత నగరానికి వెలుపల ఉన్న మగధసేనలు ఉప్పెనలా నగరంమీదికి విరుచుకుపడ్డాయి.

తిరుగుబాటుదారులూ, వారి గ్రీకుమి త్రులూ తాము ఆలోచనలు జరుపుతూన్న భవనం నుంచి బయట పడడానికి ఎంత ప్రయత్నించినప్పటికీ వెలుపలికి రాలేకపో యారు. కొంతసేపు పోరాడిన తరవాత వాళ్ళం దరూ అశోకుడి సేనలకు లొంగిపోయారు!

తిరుగుబాటుదారులకు కొంత సైన్యం ఉన్నది. కాని వారికి సరైన శిక్షణ లేదు; పోరాట వ్యూహాలు తెలియవు. శత్రువులను దెబ్బతీయడానికి గానీ, తమను రక్షించు

కోవడానికి గానీ వారికి తగిన శిక్షణలేదు. వాళ్ళు అశోకుడి సేనలతో నగరంలో అక్కడక్కడ పోరాడారు. కాని ఆ సేనల ధాటికి తట్టుకోలేక కొందరు పారిపోయారు. మరి కొందరు ప్రాణాలు కోల్పోయారు.

తెల్లవారేసరికి తిరుగుబాటుదారుల ప్రయత్నాలన్నీ విఫలమై నగరం మళ్ళీ అశోకుడి సేనల హస్తగతమయింది. బందీలుగా దొరికినతిరుగుబాటుదారుల నాయకులనూ, వాళ్ళ మిత్రులనూ పెడరెక్కలు విరిచికట్టి నగర మధ్యానికి నడిపించారు. నగరమధ్యంలో ఎత్తుగా, సమతలంగా బ్రహ్మాండమైన రచ్చబండ ఒకటి ఉన్నది. ఖైదీలందరినీ దాని మీదికి నడిపించారు. నగర ప్రజల నందరినీ అక్కడికి చేరమని చాటింపు వేయడంతో తక్షశిల ప్రజలందరూ ఏం జరుగనున్నదో అన్న ఉత్కంఠతతో రచ్చబండ చుట్టూ గుమిగూడారు.

కొంతసేపటికి యువరాజు అశోకుడు అక్కడికి గుర్రంమీదవచ్చి, రచ్చబండమీదికి చేరాడు. తలలువంచుకుని మౌనంగా నిలబడిన తిరుగుబాటుదారులనుచూసి అశోకుడు, "మీ కేవైనా బాధలు ఉన్నట్టయితే అధికారులకు చెప్పుకోవాలి.అంతేగాని అధికారానికి ఎదురుతిరిగి మగధ అధికారులను చంపి వారి ఆస్తులను దోచుకోవాలనే దుర్బుద్ధి మీకెలా కలిగింది?" అని అడిగాడు.

కొంతసేపు మౌనం తరవాత బందీలలో ఒకడు, "మా బాధలను ఇక్కడున్న రాజప్రతినిధికి చెప్పుకున్నాం. కాని ఆయన వాటిని లెక్కచేయలేదు, ప్రభూ!" అన్నాడు.

"రాజప్రతినిధి అశ్రద్ధ చేశాడనే అనుకుందాం. మీరాసంగతిని రాజధానికి వచ్చి మహారాజుకు గాని, ప్రధానమంత్రికి గాని చెప్పుకోవచ్చు కదా? మరి ఎందుకు అలా చేయలేదు?" అని అడిగాడు అశోకుడు.



దానికి బందీలనుంచి ఎటువంటి సమాధానమూ రాలేదు.

"సరే, మీబాధలగురించి రాజుకు చెప్పుకోలేదు. ఆసంగతి అలాఉంచుదాం. ఈ విషయంగా మీరు పరాయిదేశస్థులను సంప్రతించవలసిన అవసరం ఏముంది? మనరాజ్య వ్యవహారాలలో వారి జోక్యం ఎందుకు?"అని ప్రశ్నించాడు అశోకుడు.

ఆ ప్రశ్నకు కూడా బందీల నుంచి సమాధానం రాలేదు.

"గ్రీకులూ, స్వార్థపరులైన కొందరు స్థానిక ప్రముఖులూ కలిసిపన్నినకుట్రఫలితమే ఈ తిరుగుబాటు అన్నది తేటతెల్లమైపోయింది. ఒకప్పుడు ఈ ప్రాంతం గ్రీకుల సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. మౌర్యసామ్రాజ్య స్థాపకుడైన చంద్రగుప్తుడు గ్రీకులను ఈ ప్రాంతం నుంచి వెడలగొట్టాడు. ఆ అవమానాన్ని గ్రీకులు ఇంకా మరిచిపోలేదు. వారి చర్యలను అర్థం చేసుకోగలం. కాని వారితో చేతులు కలిపి అలజడినిసృష్టించిన మనరాజ్య పౌరుల మాటేమిటి? వారి ప్రవర్తనను ఎలా సమర్థించగలం? తమ దేశాన్ని పరాయివారికి అప్పగించడానికి వెనుకాడని పరమ నీచస్వభావం వారిది. వాళ్ళు క్షమార్హులుకారు. తగినవిధంగా శిక్షించాలి!" అన్నాడు అశోకుడు గంభీరంగా.

వాళ్ళకు ఎలాంటి శిక్ష పడుతుందో అని ప్రజలు ఉత్కంఠతతో ఊపిరి బిగబట్టుకుని వినసాగారు. మౌనాన్ని ఛేదించుకుంటూ అశోకుడు, "మనరాజ్యంలో తిరుగుబాటును పురికొల్పిన విదేశీయులకు మరణశిక్ష విధిస్తున్నాను. వారితో చేతులు కలిపిన రాజద్రోహులైన స్థానికులకుకూడా మరణదండన విధిస్తున్నాను!" అని ప్రకటించి వెనక్కు తిరిగాడు.

"క్షమించండి యువరాజా! క్షమించండి! తెలియక నేరంచేశాం. ఇకపై బుద్ధిగామసలుకుంటాం. ప్రాణభిక్ష పెట్టండి!" అని బందీలు ఏడ్వసాగారు.

అశోకుడు ఒకక్షణం ఆగి, వెనక్కుతిరిగి, "ద్రోహులను కరుణించి, క్షమించడం తగని కార్యం! ఈ శిక్ష మిగిలిన అందరికీ హెచ్చరిక కావాలి!" అని అధికారుల కేసి ఒకసారి చూసి, గుర్రాన్ని అధిరోహించి శిబిరానికి బయలుదేరాడు.

ఆమరుక్షణమే బందీల ఊచకోత ఆరంభమయింది. అక్కడి వాతావరణం భయానకంగా మారిపోయింది. - (ఇంకావుంది)






# తాను తీసిన గొయ్యి...

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగేమౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో, పట్టువీడక కార్యసాధనకోసం నువ్వు చేస్తున్న కృషి చూస్తూంటే ఎవరికైనా ఆశ్చర్యం కలగకమానదు. ఇంతకూ, నువ్విన్ని శ్రమలకూ లోనవ్వడానికి కారణం, ఏవైనా అద్భుతశక్తులు సంపాయించేందుకేమో తెలియదు. అలాంటి శక్తులు సాధించడానికి అనేకానేక మార్గాలున్నవి. అలాంటి వాటిలో తపస్సు ఒకటి. తపస్సంపన్నులైన సాధుపుంగవులకు అద్భుతశక్తులు లభించడంలో వింత ఏమీలేదు. అయితే, అలాంటి మహాపురుషులు ఆ శక్తులను తమ స్వార్థానికి కాక ఇతరుల మేలుకు మాత్రమే ఉపయోగిస్తారు. అలాకాక, వాటిని తమస్వప్రయోజనానికి ఉపయోగించ

## బేతాళ కథలు



తలచిననాడు, ఆ శక్తులు ఆశించిన కార్యం సాధించలేవు. కాని, సర్వసాధారణమైన ఈ ధర్మసూత్రానికి విరుద్ధంగా, ఒకానొక సాధు పుంగవుడు స్వార్థం కాంక్షించి ఇచ్చినవరం ఫలించింది. భవిష్యత్తులో నీకుమార్గదర్శకంగా వుండేందుకు,ఆకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పద్మాకరుడు,రత్నాకరుడు అనేవాళ్ళు అన్నదమ్ములు. పద్మాకరుడు వ్యాపారంలో బాగా ఆర్జిస్తున్నాడు.తమ్ముణ్ణి కూడా తనతో కలవమన్నాడు.కానీ రత్నాకరుడు అందుకు ఒప్పుకోక, "నాకు దూరప్రాంతాలకుపోయి బాగా చదువుకోవాలనివున్నది.ఆస్తిలో నా వాటానాకు పంచియివ్వు!" అన్నాడు.

పద్మాకరుడు పెద్దల సమక్షంలో, తండ్రి తనకిచ్చి పోయిన ఆస్తిని రెండువాటాలుచేసి, ఒక వాటాను తమ్ముడికిచ్చాడు. అది తీసుకుని రత్నాకరుడు ఎక్కడెక్కడి ప్రాంతాలూ తిరిగి విలాసాలకులొంగిపోతూ, వున్నదంతా పోగొట్టుకుని మళ్ళీతిరిగి తన ఊరొచ్చాడు. అన్నకు మాత్రం బందిపోటు దొంగలు తన ఆస్తినంతా దోచుకున్నారని అబద్ధం చెప్పాడు.

పద్మాకరుడు తమ్ముడి మాటలు నమ్మాడు. తన వద్దనే వుండమని చెప్పాడు. రత్నాకరుడందుకు అంగీకరించక,"ఆత్మగౌరవమున్నవాడు తనకాళ్ళమీద తను నిలబడాలనుకుంటాడు. నీకు నా మీద నమ్మకముంటే కొంతడబ్బు అప్పుగా ఇవ్వు. దాంతో వ్యాపారం చేసుకుని బాగుపడతాను," అన్నాడు.

ఈ మాటలకు పద్మాకరుడు నవ్వి,"ఆత్మగౌరవమున్నవాడు వ్యాపారంచేయాలనుకుంటే పెట్టుబడికికూడా స్వయంకృషి మీదనే ఆధారపడాలి. నువ్వుసమర్థుడివి. నీసమర్థత బయటపడాలంటే, నీకు బాధ్యత తెలియాలి. బాధ్యత తెలియాలంటే పెళ్ళికావాలి. ఈఊళ్ళో ధనవర్ధనుడి కుమార్తె హేమాంగి నీకు అన్ని విధాలా తగిన భార్య. ఆమెను పెళ్ళిచేసుకో. ఆమె అరణపు నగలతో వ్యాపారం ప్రారంభించు. పెళ్ళయ్యాక భార్యాభర్తలకు స్వపర భేదముండదు కాబట్టి, ఆమె డబ్బు వాడుకొనడం నీ ఆత్మగౌరవానికి అడ్డురాదు," అని చెప్పాడు.

నెలతిరక్కుండానే రత్నాకరుడికి, హేమాంగితోపెళ్ళయింది.వ్యాపారంలో అంతగా రాణించకపోయినా అతడికిరోజులు బాగానే గడిచిపోతున్నాయి. క్రమంగా అతడికి ముగ్గురు పిల్లలు కలిగారు.

పద్మాకరుడికి మాత్రం శ్రీముఖుడొక్కడే కొడుకు. వాడికి పది సంవత్సరాలవయసులో

తల్లి పోయింది. పద్మాకరుడికి భార్య అంటే ప్రాణం. ఆమె పోగానే ఆయనకు జీవితంమీద విరక్తి పుట్టింది. ఆయన తమ్ముణ్ణి పిలిచి,తన ఆస్తినీ, శ్రీముఖుణ్ణీ అప్పగించి, హిమాలయా లకు వెళ్ళిపోయాడు.ఆవిధంగా రత్నాకరుడు గొప్ప ఆస్తిపరుడయ్యాడు. హేమాంగి తెలివైనది కావడంవల్ల అతడు వ్యసనాలకు లోనై డబ్బు వృథాచేయడం సాగలేదు.

అయితే ఆ భార్యాభర్తలకు శ్రీముఖుడి గురించి బెంగగావుండేది. ఆస్తిఅంతా వాడిది. పెద్దయ్యాక ఆస్తిఅంతా వాడికిఅప్పజెప్పవలసి వుంటుంది.మోసంచేస్తే ఊరి పెద్దలూరుకోరు. కానీ వాడి ఆస్తిని తమ స్వంతం చేసుకోవాలని వాళ్ళకు ఆశగా వున్నది! బాగా ఆలోచించగా వారికొక ఉపాయం తట్టింది. శ్రీముఖుణ్ణి మంచి మాటలతోవశపర్చుకుని ఎందుకూ పనికిరానివాడిగాతయారుచేయాలనుకున్నారు.

ఒకరోజునరత్నాకరుడు, శ్రీముఖుణ్ణిపిలిచి, "చదువుకోవడంవల్ల నాకు చెడు అలవాట్లు అబ్బాయి. నా వాటా ఆస్తినంతా పాడుచేసుకున్నాను.మీ నాన్న నాచేత చదువు మానిపించాక, నేను బాగుపడ్డాను. కాబట్టి నువ్వుకూడా చదువు మానెయ్యి," అన్నాడు.

శ్రీముఖుడు చదువు మానేశాడు.

"ఈ ఊళ్ళో ఎందరో వుండగా, నిన్ను మీ నాన్న నాకే అప్పగించాడు. అంటే నా వల్ల మాత్రమే నీకుమంచి జరుగుతుందని ఆయన అభిప్రాయం. ఇక మీద నువ్వు నా మాట మాత్రమే వినాలి. ఎవరేమి చెప్పినా వినవద్దు," అన్నాడు రత్నాకరుడు.అప్పటి నుంచీ శ్రీముఖుడు చిన్నాన్న మాటలు మాత్రమే వింటున్నాడు.




"సంపదలు శాశ్వతంకాదు.అందుకే మనిషి కష్టపడి బతకటంనేర్చుకోవాలి.ఈరోజునుంచి నువ్వు ఇంటి పనులన్నీచెయ్యి," అన్నాడు రత్నాకరుడు.

ఆనాటి నుంచీ శ్రీముఖుడు, ఆ ఇంట్లోని పనివాళ్ళలో ఒకడైపోయాడు.

"నీ చేత పనులన్నీ చేయిస్తూ, మేమెవ్వరం కష్టపడడం లేదేమన్న ఆలోచన నీకు రావచ్చు. ఆలోచన మనిషికి మేలు చేయదు, అపకారం చేస్తుంది! మీఅమ్మ పోగానే మీనాన్నలో ఆలోచన ఎక్కువయింది. అందువల్లనే ఇల్లువదిలి వెళ్ళిపోయాడు. ఆలోచనే లేకుంటే నీతోనేకలిసుండేవాడు. కాబట్టి నువ్వు ఆలోచనాభారాన్ని నాకు వదిలిపెట్టు. మేమంతా నీ యజమానులమనుకో. మమ్మల్నిసేవించుకో. తప్పకనీకు మేలుజరుగుతుంది," అన్నాడు రత్నాకరుడు.



ఆక్షణంనుంచి శ్రీముఖుడుఆలోచించడం పూర్తిగామానుకున్నాడు. అయితే అప్పుడప్పుడూ వాడికి, చిన్నాన్న బిడ్డల మీద కోపం వచ్చేది. చిన్నాన్నమీద చిరాకు కలుగుతుండేది. ఇది గ్రహించిన రత్నాకరుడు, వాడితో "పెద్దలపై చిరాకుపడడం నేరం. చిన్న వాళ్ళపై కోపగించు కోవడంతప్పు. కొడుకు చేసే నేరాలు, తల్లి దండ్రులను బాధిస్తాయి. నువ్వు నేరం చేస్తే స్వర్గంలోవున్న మీ అమ్మ నరకం పాలవు తుంది. హిమాలయాల్లోవున్న మీనాన్న రోగాల పాలవుతాడు," అని బెదిరించాడు. దాంతో శ్రీముఖుడు పూర్తిగా శాంతమూర్తి అయ్యాడు.

ఈ జరుగుతున్నది చూసినవాళ్ళు కొందరు శ్రీముఖుడిపై జాలిపడేవాళ్ళు. కొందరైతే రత్నాకరుడికే ఇది తగదని చెప్పేవారు. రత్నా కరుడు నిరసనగా, "వాడి తండ్రి సన్యాసి. వాడూ సన్యాసిలా జీవించాలనుకున్నాడు. ఆనాటి శంకరుడి తర్వాత మా శ్రీముఖుడికే ఇది సాధ్యపడింది. మాకూ అలావుండా లనివుంది. కానీ ఆ అదృష్టం అందరికీపట్ట వద్దూ! ఎంత కోరుకుంటేమాత్రం మా అదృష్టం వాడికీ, వాడి అదృష్టం మాకూ మారుతుందా?" అనేవాడు.

ఈ మాటలు విన్నాక శ్రీముఖుడికి తను గొప్ప అదృష్టవంతుడిననీ, ఆ అదృష్టం చిన్నాన్న వల్లనే కలిగిందనీ, ఎంత ప్రయత్నించినా ఆ అదృష్టం చిన్నాన్నను వరించడం లేదనీ అనుకున్నాడు. ఆ అభిప్రాయంవాడిలో క్రమంగా స్థిరపడిపోయింది.

అలా పదేళ్ళు గడిచాయి.

హిమాలయాలకు వెళ్ళిన పద్మాకరుడు మనశ్శాంతికోసం కొంతకాలం తపస్సుచేశాడు. అందువల్ల ఆయనకు కొన్ని అద్భుతశక్తులు లభించాయి. అప్పుడాయనకు కొడుకును చూడాలని మనసు పుట్టింది. బయల్దేరితన ఊరుకు వచ్చాడు.

గడ్డాలూ,మీసాలూబాగాపెరిగిపోయినపద్మా కరుణ్ణి, రత్నాకరుడు గుర్తించలేదు. పద్మాక రుడూ తమ్ముడికితానెవరైందీచెప్పలేదు. సాధు పుంగవుడిలా ఆయన ఇంటిముందు నిల బడితే, నిజమేఅనుకుని రత్నాకరుడు లోపలకు ఆహ్వానించాడు.

పద్మాకరుడి సేవలకుగానురత్నాకరుడు, శ్రీముఖుణ్ణి నియోగించాడు. శ్రీముఖుడు భక్తి శ్రద్ధలతో పద్మాకరుడి అవసరాలుచూడ సాగాడు. కొద్దిసేపటికే ఆయనకు, ఆ ఇంట తన కొడుకు స్థానమేమిటో తెలిసి పోయింది. పద్మాకరుడు దుఃఖం ఆపుకోలేక, "నాయనా!

నువ్వీఇంటియజమానివి.నీకిలా సేవకవృత్తిని స్వీకరించాల్సిన దౌర్భగ్యమెలా పట్టింది?"అని అడిగాడు కొడుకును.

"ఇది నా దౌర్భాగ్యం కాదు, అదృష్టం!" అన్నాడు శ్రీముఖుడు వెంటనే.

"నీ చిన్నాన్న దుష్టుడు. నిన్ను మోసగించాడు," అన్నాడు పద్మాకరుడు కసిగా.

శ్రీముఖుడు, తండ్రివంక కోపంగా చూసి, లోపలకు పరుగున వెళ్ళి రత్నాకరుడితో, "ఆ సాధువు నిన్నుదుష్టుడనీ, మోసగాడనీ అంటున్నాడు. అది నేను భరించలేను. ఆయనకు సేవలు చెయ్యలేను," అన్నాడు.

రత్నాకరుడు, శ్రీముఖుణ్ణి వెంటబెట్టుకుని పద్మాకరుడి వద్దకు వచ్చి, "తమరు నిజంగా సాధుపుంగవులని నమ్మాను. కానీ అందరిలాగే మీరూ నన్ను దుష్టుడనీ, మోసగాడనీ అనడం, నాకు మీపై అనుమానాన్ని కలిగిస్తున్నది. నా అన్నకొడుక్కు నేనంటే ప్రాణం. నామీద ఈగవాలనివ్వడని తమరు గ్రహించాలి," అన్నాడు.

అందుకు పద్మాకరుడు కోపంగా, "నేను నిజంగా సాధుపుంగవుణ్ణే. నీ మోసాన్నిగ్రహించాను. నా మీద నీకున్న అనుమానాన్ని పోగొట్టడానికి గాను– శ్రీముఖుడికి నేనొక వరమివ్వదలిచాను," అంటూ కుమారుడికేసి చూస్తూ, "ఇతరులకేహానీ కలక్కుండా, నీకేం కావాలో కోరుకో, నాయనా!" అన్నాడు.

శ్రీముఖుడు, రత్నాకరుడి వంక చూశాడు. రత్నాకరుడు కోరుకోమన్నట్టు సైగ చేశాడు.

"నేను చాలా అదృష్టవంతుణ్ణి. నా గురించి అన్నీ ఆలోచించే చిన్నాన్నవున్నాడు.అందువల్ల నాకే కోరికలూ లేవు," అన్నాడు శ్రీముఖుడు.




రత్నాకరుడు గర్వంగా నవ్వి, "చూశారు కదా! నా అన్న కొడుక్కు తన గురించి ఆలోచించుకోవాలన్నధ్యాస కూడా లేదు," అన్నాడు.

అప్పటికి పద్మాకరుడికి పరిస్థితి పూర్తిగా అర్థమయింది. తన తమ్ముడు, శ్రీముఖుణ్ణి ఎందుకూ పనికిరానివాడిగా చేశాడు. అలాంటి తన కొడుక్కు సాయపడడమెలా?

ఆయన ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో రత్నాకరుడు, "శ్రీముఖా! సాధుపుంగవులంతగా అడుగుతున్నప్పుడు కాదనకూడదు. నీకే కోరికలు లేకపోతే, నీ చిన్నాన్నను సంతోషపెట్టే వరమేదైనా అడుగు, వారు తప్పక ఇస్తారు," అన్నాడు.

శ్రీముఖుడు క్షణంకూడా తటపటాయించకుండా, "ఇక మీదట నా అదృష్టమంతా చిన్నాన్నది కావాలి. చిన్నాన్న అదృష్టమంతా

నాది కావాలి. ఆయనను సంతోషపెట్టేవరం నాకు తెలిసి, అదొక్కటే!" అన్నాడు.

"తథాస్తు!" అన్నాడు పద్మాకరుడు.

ఆవరంవెంటనేఫలించింది.ఆరోజునుంచి శ్రీముఖుడా ఇంటియజమాని అయ్యాడు. రత్నాకరుడు కుటుంబంతో సహా, ఆ ఇంటి సేవకుల్లో కలిశాడు. పద్మాకరుడు తానెవ్వరో చెప్పకుండానేహిమాలయాలకుతిరిగివెళ్ళాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, "రాజా, తాంత్రికులు తప్ప, సాధువులైన వాళ్ళెవరూ తమకు లభించిన శక్తులను స్వార్థానికి ఉపయోగించుకోరు. అలా చేయడం సాధులక్షణం కాకపోగా అవి ఆశించిన ఫలితాన్నివ్వవు. అయినా పద్మాకరుడు స్వార్థబుద్ధితో తనకొడుకు మేలు కోరి, తమ్ముడికి కీడుచేసేవరం ఇచ్చినా ఫలించింది. ఇది వింతగానూ, ధర్మ సంకరంగానూ లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దురాశాపరుడైన రత్నాకరుడు, ఆత్మబంధువన్న సంగతి కూడా మరిచి శ్రీముఖుణ్ణి సొంత ఆలోచన అంటూ లేనివాడుగా చేస్తూ, క్రమంగా వాణ్ణొక జడప్రాయుడి స్థాయికి దిగజార్చి, తాను తీసిన గోతిలో తానే పడ్డాడు. నయవంచకుడైన రత్నాకరుడి పొగడ్తలు నమ్మిన శ్రీముఖుడికి, తను అదృష్టవంతుణ్ణనీ, చిన్నాన్న దురదృష్టవంతుడనీ గట్టి నమ్మకం ఏర్పడి పోయింది. ఇతరులకు హాని కలిగించాలని కాక, పరోపకారబుద్ధితోనే వాడు వరం కోరడం వల్ల,అది వెంటనే ఫలించింది. సాధుసన్యాసులే కాక, అలా కానివారు కూడా చేతనైతే దుష్టులను శిక్షించడం అన్నివిధాలా ధర్మ సమ్మతం అనిపించుకుంటుంది. పద్మాకరుడు కావాలనుకుంటే, తనకున్న అద్భుతశక్తులనుపయోగించి తమ్ముణ్ణి శపించ గలడు. లేకఊరి పెద్దలకు తనెవరైనదీచెప్పి, అందరూ దుష్టుడని భావించే అతణ్ణి ఊరి నుంచి తరిమించి వేయగలడు. దుష్టులను శిక్షించడం ప్రజాహితం; ధర్మసమ్మతం. ఇందులో స్వార్థంలేదా ధర్మసంకరం అంటూ లేశమాత్రం కూడా వుండదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# భట్టు చమత్కారం

ఒకానొక రాజుగారి కొలువులో, నారాయణ భట్టు అనే విదూషకుడుండేవాడు. ఆయన ఎంతో సమయస్ఫూర్తితో, వాక్చాతుర్యంతో సభికులనూ, రాజుగారినీ ఆనందపరుస్తూం డేవాడు. ఆయనకు కోటగోడ దాపుల రాజు గారు ఒక చక్కని ఇంటిని బహూకరించాడు.

ఆ ఇంట్లో నారాయణభట్టు, ఇరుగు పొరుగుల బాధలేకుండా చాలాకాలం హాయిగా జీవించాడు. అయితే, ఆమధ్య బాహుబలు డనే మల్లుడు, నారాయణభట్టు ఇంటి పక్కనవున్న ఇల్లొకటి కొని, అందులో ప్రవేశిం చాడు. దానితో ఆయనకు రాత్రివేళ సరైన నిద్ర అంటూ లేకుండా పోయింది.

దీనికి కారణం మల్లుడు పెంచుతున్న కాపలాకుక్క. అది రాత్రివేళ పెద్దగా మొరు గుతూ, కర్ణకఠోరంగా అరుస్తూ నారాయణ భట్టుకు నిద్రాభంగం కలిగించ సాగింది. కొద్ది రోజులు ఆ బాధ భరించిన నారాయణ భట్టు, ఒకనాడు మల్లుడితో సంగతి చెప్పి రాత్రివేళ కుక్క అరవకుండా కట్టుదిట్టం చెయ్యమన్నాడు.

ఇందుకు మల్లుడు పెద్దగా నవ్వి, "నేను పెంచుతున్నది కాపలాకుక్క. అది దొంగలను ఈచుట్టుపక్కలకురాకుండా చేస్తున్నది. ఇందు వల్ల, నీకూ మేలే కదా!" అన్నాడు.

"మేలు సంగతి దేవుడెరుగు. నాకు రాత్రిళ్ళు నిద్ర కాదు గదా, కునుకు కూడా పట్టడం లేదు. నీ కుక్క రాత్రివేళ కొత్తవాళ్ళనూ, దొంగలనూ చూసినప్పుడే మొరిగేలా శిక్షణ ఇవ్వు. అలా చేయకపోయావో దాని నోరు మూయించేందుకు నేనుగట్టి ప్రయత్నంచేయ బోతున్నాను," అన్నాడు నారాయణభట్టు.

ఆ మాటలకు మల్లుడు వెటకారంగా నవ్వి, "నేను పెంచుతున్నది మామూలు కాపలాకుక్క అనుకునేవు, అది వేటకుక్క జాతిది. అందుకే దాన్ని రాత్రీ పగలూ కూడా

ఎస్.డి. రావు

ఇంటి ముందున్న కొయ్యగుంజకు కట్టేస్తు న్నాను. అది మనిషినే కాదు, సింహాన్నయినా సమీపానికి వస్తే పీకపట్టేస్తుంది," అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నారాయణభట్టు నాలుగైదు రాత్రులు కుక్కఅరుపులు భరించి, ఇక ఇది పనికాదని కర్ర ఒకటి తీసుకుని, రాత్రిఅది అరవడంమొదలుపెట్టగానే దాన్ని సమీపించి, కర్రతో దానినడుంమీద గట్టిగా కొట్టాడు.

ఆ దెబ్బకు కుక్కమరింత పెద్దగా అరుస్తూ, మెడతాడును తెంచుకుని పారిపోయేందుకు గుంజుకుంటూ గంతులేయసాగింది. దాని అరుపులకు మల్లుడు తలుపు తెరుచుకుని బయటికి వస్తూనే, "ఆహా, ఎన్నాళ్ళకు నా కాపలాకుక్క దొంగను పట్టిచ్చింది!" అంటూ నారాయణభట్టుకేసి ఉరకబోయాడు.

"ఆగు! ఆగు! నేను దొంగను కాదు, నారాయణభట్టు! నీ కుక్కకు ఎవర్ని చూసి మొరగాలో, ఎప్పుడుమొరగాలో నేర్పేందుకు, ఇప్పుడే నడుంమీద కర్రతోకొట్టాను," అన్నాడు భట్టు.

అది వింటూనే మల్లుడు ఉగ్రుడైపోతూ, "నా పెంపుడు కుక్కను కర్రతో కొట్టడమా? నేను సహించేది లేదు!" అన్నాడు.

"నేను నీ కుక్క అరుపులకు నిద్రపట్టక చాలాకాలం సహించాను. ఇప్పుడు నువ్వు సహించక ఏంచేయగలవు?" అన్నాడు నారాయణభట్టు.

"మరొకసారి నాకుక్క నడుంమీద కొట్టావో, నీ నడుం విరగ్గొడతాను," అన్నాడు మల్లుడు పళ్ళు కొరుకుతూ.

"అలా అయితే, దాని తల మీద కొడతాను. చూస్తూ ఊరుకో!" అన్నాడు నారాయణభట్టు.

ఆ మాటకు మల్లుడు పట్టరాని ఆగ్రహం కొద్దీ కాళ్ళతో నేలను గట్టిగా తాటిస్తూ, "దాని తలమీద కొట్టావో, నీతల బద్దలు కొడతాను. కాళ్ళమీద కొట్టావో, నీ కాళ్ళు విరగ్గొడతాను! తెలిసిందా?" అన్నాడు.

"ఆc, బాగాతెలిసేట్టుచెప్పావు! ఇక నుంచి రాత్రివేళ నీకుక్క నాకు నిద్రాభంగం కలిగించిందో, వెంటనే వచ్చి దాని జల్లితోక నజ్జునజ్జయ్యేలా కొడుతూంటాను!" అంటూ నారాయణభట్టు అక్కణ్ణించి కదిలాడు.

మల్లుడికి నారాయణభట్టు చమత్కారం అర్థమై, పెద్దగా నవ్వుకుని, తనకుక్కకు రాత్రివేళ ఉట్టినే మొరక్కుండా తగిన శిక్షణ ఇవ్వాలనుకున్నాడు.






# సముద్రతీర ప్రయాణాలు - 18

# చెన్నయ్ మహానగరం

రచన: మీరానాయర్ ☆ చిత్రాలు: కె.ఎస్.గోపకుమార్

ఫ్రాన్సిస్ డే, సెయింట్ జార్జ్ కోటను నిర్మించినప్పుడు – సహజసిద్ధమైన ఓడరేవు లేని స్థలాన్ని ఎంపిక చేశాడని, ఆయన పలువురి విమర్శలకు గురయ్యాడు. తొలి రోజులలో తీరానికి దూరంగా సముద్రంలో ఓడలు నిలిచేవి. అక్కడినుంచి పడవలమీదా, తెప్పకొయ్యల మీదా ప్రయాణీకులను తీరానికిచేర్చేవారు. ఆతరవాత 1881వ సం॥ నాటికి మెరీనా బీచ్‌కి ఉత్తరంగా ఓడరేవును నిర్మించారు. ఈనాడు చెన్నయ్ మన దేశంలోని ముఖ్యమైన ఓడరేవులలో ఒకటిగా ఉంటున్నది.

మెరీనా బీచ్‌కి దక్షిణాగ్రంలో శాంథోమ్ చర్చ్ ఉన్నది. క్రీ.శ. 52వ సం॥లో చెన్నయ్‌కి వచ్చాడని విశ్వసింపబడే క్రైస్తవమత ప్రచారకుడు సెయింట్ థామస్ డిడైమస్ సమాధి మీద ఈ చర్చ్ నిర్మించబడింది. క్రైస్తవమత ప్రచారానికి మొట్టమొదట భారత దేశానికి వచ్చిన ఆ మత ప్రచారకుడి చరిత్రను అందమైన చర్చ్ కిటికీ అద్దాల మీద చక్కగా చిత్రించారు.

శాంథోమ్ సమీపంలో అడైయార్ నదీతీరంలో థియోసాఫికల్ సొసైటీ (దివ్యజ్ఞాన సమాజం) ప్రపంచ ప్రధానకార్యాలయం ఉన్నది. ఈ సమాజాన్ని అమెరికా దేశస్థులైన మేడమ్ బ్లావట్‌స్కీ– కల్నల్ ఆల్కాట్ స్థాపించారు. మనదేశ స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన డా॥ అనీబిసెంట్ ఈ సంస్థను అడైయార్‌లో నెలకొల్పారు.



శాంథోమ్ చర్చ్

ఈ సొసైటీ ప్రాంగణంలో ఉన్న గ్రంథాలయం ప్రపంచ ప్రసిద్ధి గాంచింది. తూర్పుదేశాల నాగరికతా సంస్కృతులకు సంబంధించిన దాదాపు 1,65,000 గ్రంథాలూ, 20,000 తాళపత్ర గ్రంథాలూ ఈ గ్రంథాలయంలో ఉన్నాయి.

ఈ సొసైటీ ఉద్యానంలో అన్ని మతాలకు సంబంధించిన ఆలయాలూ ఉన్నాయి. ఇక్కడే 200 సంవత్సరాల నాటిదిగా భావించబడే బ్రహ్మాండమైన మర్రి వృక్షం ఉన్నది. ఈ వృక్షం నీడలో 3000 మంది నిలబడవచ్చు.



కళాక్షేత్ర ఆడిటోరియం

థియోసాఫికల్ సొసైటీ సమీపంలోనే మన సంప్రదాయ సంగీతానికీ, నాట్యానికీ ప్రపంచ ప్రసిద్ధి గాంచిన కళాక్షేత్ర సంస్థ ఉన్నది. సుప్రసిద్ధ థియోసాఫిస్ట్ రుక్మిణీదేవి అరుండేల్ దీనిని 1936వ సం॥లో స్థాపించారు.

తమిళనాడుకు చెందిన సంప్రదాయ నాట్యమైన భరతనాట్యాన్ని 1930వ సం॥కి పూర్వం దేవాలయాలలో దేవదాసీలు మాత్రమే ప్రదర్శించేవారు. గౌరవమైన కుటుంబాలకు చెందిన యువతులెవరూ ఈనాట్యాన్ని నేర్చుకోడానికి ఆసక్తి చూపే వారు కారు. కళాక్షేత్ర సంస్థ ఏర్పడిన తరవాత ఆ ధోరణిలో మార్పు వచ్చింది. చదువుకున్న కుటుంబాలకు చెందిన యువతులు కూడా భరతనాట్యం నేర్చుకోవడం ప్రారంభించారు. భరతనాట్యానికి గౌరవం తీసుకురావడంలో కళాక్షేత్ర విజయం సాధించింది. దీని కారణంగా ఇవాళ చెన్నయ్ నగరం భరతనాట్యానికి కేంద్రంగా వెలుగొందుతున్నది.

కళాక్షేత్రకు మరికొంత దూరంలో గిండి నేషనల్ పార్క్ ఉన్నది. నల్లజింకలు ఇక్కడి ప్రత్యేక ఆకర్షణ. రాజ్ భవన్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (ఐ.ఐ.టి) గిండి ఇంజనీరింగ్ కాలేజ్ (మనదేశంలోని అతి ప్రాచీనమైన ఇంజనీరింగ్ విద్యాసంస్థ) ఇక్కడ ఉన్నాయి. గిండీ నేషనల్ పార్క్ పక్కనే మద్రాసు స్నేక్ పార్క్ ఉన్నది. మనదేశంలో స్థిరపడిన అమెరికా దేశస్థుడైన రోములస్ విటాకర్ దీనిని స్థాపించాడు. సాధారణంగా మనదేశంలో కనిపించే పాములన్నిటినీ ఇక్కడ చూడవచ్చు.

స్థలపురాణాలు గల దేవాలయాలు చెన్నపట్టణంలో చాలా ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనది మైలాపూర్‌లోని కపాలీశ్వర ఆలయం; ట్రిప్లికేన్‌లోని పార్థసారథి ఆలయం.

కైలాసంలో శివపార్వతులు ఏదో మాట్లాడుకుంటూండగా పార్వతి పరధ్యానంగా కనిపించింది. దాంతో ఆగ్రహం చెందిన పరమశివుడు ఆమెను నెమలివి కమ్మని శపించాడు. మళ్ళీ మామూలు రూపంలో పరమశివుడు తనను స్వీకరించేంతవరకు పార్వతి నెమలిరూపంలో తపస్సు చేసింది.

నెమలిని తమిళంలో మయిల్ అంటారు. మయిల్ (నెమలి) తపస్సు చేసిన స్థలం కాబట్టి దీనికి మైలాపూర్ అనే పేరు వచ్చిందని ఒక పురాణకథ చెబుతుంది.

మైలాపూర్‌లో బ్రహ్మాండమైన– కపాలీశ్వర ఆలయం అనే శివాలయం ఉన్నది. ఇదే ప్రాంగణంలో 'కర్పగాంబాళ్' మందిరం; పొన్న చెట్టు కింద నిర్మించిన నెమలిరూపంలోనిపార్వతి మందిరం ఉన్నాయి. ఈ పొన్నచెట్టు చాలా ప్రాచీనమైనదని చెబుతారు.



శ్రీ పార్థసారథి దేవాలయం

కపాలీశ్వర ఆలయానికి కొద్ది దూరంలోనే చెన్నయ్ నగరంలోని అతిప్రాచీనమైన యూరోపియన్ చర్చిగా పేరుగాంచిన లజ్ చర్చ్ ఉన్నది. 'అవర్ లేడీ ఆఫ్ లైట్' గౌరవవార్థం పోర్చుగీసులు 1547 - 1582 మధ్యకాలంలో దీనిని నిర్మించారు. సముద్ర ప్రయాణంచేస్తూన్న పోర్చుగీసుల ఓడ మునిగిపోయి బాధపడుతున్న సమయంలో వారికి దూరంగా వెలుగు కనిపించిందట. ఆ వెలుగును చూస్తూ పయనించి వాళ్ళు క్షేమంగా తీరం చేరారు. తీరం చేరాక వెలుగు మాయమయ్యిందట. వెలుగు కనిపించిన చోట నావికులు కృతజ్ఞతతో ఈ చర్చిని నిర్మించినట్టు చెబుతారు.

ట్రిప్లికేన్ అనే తిరువల్లిక్కేణికి 1400 సంవత్సరాల చరిత్ర ఉన్నది. ఇదొక వైష్ణవ క్షేత్రం. ఇక్కడి కొలనులో అందమైన కలువ (అల్లి) పువ్వులు ఉండడం వల్ల ఈ ప్రాంతానికి తిరుఅల్లిక్కేణి (కలువ కొలను) అనే సార్థకనామం ఏర్పడింది. ఇక్కడ ప్రసిద్ధిగాంచిన **పార్థసారథి (శ్రీకృష్ణ)** మందిరం ఉన్నది.

ధర్మం, అర్థం, కామం అనే మూడు భాగాలలో మానవజీవితానికి సంబంధించిన అనేక సత్యాలనూ, నీతులనూ తెలియజేసే సుప్రసిద్ధ తమిళ గ్రంథం తిరుక్కురళ్. దీనిని క్రీ.పూ. 1వ శతాబ్దానికి చెందిన తిరువళ్ళువర్ రచించాడు. ఆయన పేరుమీదుగా ఇటీవల నిర్మించిన **'వళ్ళువర్ కోట్టం'** నుంగంబాకంలో ఉన్నది. ఈ కోట్టంలో తిరుక్కురళ్‌లోని 1330 ద్విపద పద్యాలను పుస్తకాకారంలోని చలవరాళ్ళ మీద చెక్కించారు.

విశాలమైన సభా మంటపానికి ఉత్తరంగా – 33 మీటర్ల ఎత్తయిన రాతి రథంలో గంభీరంగా కూర్చున్న భంగిమలో వళ్ళువర్ విగ్రహం చెక్కబడి ఉన్నది. రథాన్ని లాగుతున్నట్టు రెండు రాతి ఏనుగులు ఉన్నాయి. 4000 మంది కూర్చోవడానికి వీలు కల్పించే వళ్ళువర్ కోట్టం ఆడిటోరియం (సభామంటపం) ఆసియాఖండంలోనే పెద్దది అని చెబుతారు.

అణ్ణాసాలై (మౌంట్‌రోడ్) పీటర్స్‌రోడ్ కలిసేచోట ఉన్న నగరంలోని మరొక ముఖ్యమైన ప్రార్థనా స్థలం– థౌసండ్ లైట్స్ మాస్క్. ఇక్కడ వెయ్యి నూనెదీపాలు వెలిగించడం వల్ల దీనికి వెయ్యిదీపాల మసీదు అనే పేరు వచ్చింది.

దక్షిణభారత హాలీవుడ్‌గా ప్రసిద్ధిగాంచిన కోడంబాకం చిత్ర పరిశ్రమకు కేంద్రంగా ఉంటున్నది. పలుదక్షిణ భారతీయ భాషలలో ఇక్కడ చిత్ర నిర్మాణం జరుగుతున్నది.



తిరుక్కురళ్ రచయిత తిరువళ్ళువర్

పెరంబూరు పారిశ్రామిక కేంద్రంగా అభివృద్ధి చెందుతున్నది. మనదేశంలో రైలు పెట్టెల తయారీకి ప్రసిద్ధిగాంచిన ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ పెరంబూరులోనే ఉన్నది. ఇక్కడున్న రైల్వే ఆస్పత్రి గుండె శస్త్ర చికిత్సకు పేరుగాంచింది. పెరంబూరు సమీపంలో కాశీవిశ్వనాథ ఆలయం ఉన్నది. యేటా చెన్నయ్ నుంచి తిరుపతి వేంకటేశ్వర స్వామికి సమర్పించడానికి ఊరేగింపుగా గొడుగులు తీసుకుని వెళతారు. అలా వెళ్ళేప్పుడు ఆ గొడుగులు ఇక్కడి కాశీ విశ్వనాథ ఆలయంలో ఒకరాత్రి ఆగి వెళ్ళడం సంప్రదాయంగా ఉంటున్నది.

ఈ ఆలయానికి సమీపంలో టాకర్స్ సత్రం ఉన్నది. 1760వ సం॥ ప్రాంతంలో 'టాకర్స్' అనే గుజరాతీ కుటుంబం ఒకటి చెన్నయ్‌కి వచ్చి స్థిరపడింది. నగల వ్యాపారంలో వాళ్ళు ప్రసిద్ధిగాంచారు. ఆ వ్యాపారంలో వచ్చిన లాభాలతోనే 1804వ సం॥ ప్రాంతంలో ఇద్దరు మహిళల ప్రోత్సాహంతో ఈ ఆలయ నిర్మాణం జరిగింది.



వళ్ళువర్ కోట్టం



# తగినభార్య

కొండాపురం అనే పల్లెలో వుండే కొండయ్య అనే యువకుడు, ఒక రైతు కొడుకు. వాడు పొలంపనుల్లో తండ్రికి చేదోడుగా వుండక, ఆదేశపు రాజకుమార్తెను పెళ్ళాడి, రాజుకావాలని పగటికలలు కంటూండేవాడు. చూసి, చూసి వాడి తండ్రి ఒక రోజున వాణ్ణి ఇంటి నుంచి వెళ్ళగొట్టేశాడు.

కొండయ్యకు ఇది శుభసూచకంగా కనిపించింది. వాడు తిన్నగా రాజధానీ నగరం చేరి, మేనమామ సింగన్న ఇంటికి వెళ్ళాడు. ఈ సింగన్న ఒకప్పుడు రాజుగారి సైన్యంలో పనిచేసి ధైర్యసాహసాలకు రాజు చేత బహుమతులు పొందినవాడు. ఇప్పుడు సింగన్న కూతురు మల్లిక, రాజకుమారి ప్రియంవదకు ప్రధాన చెలికత్తెగా వుంటున్నది.

కంటికి నదురుగా వున్న కొండయ్యను చూసి సింగన్న చాలాసంతోషించాడు. ఇలాంటివాడికి రాజుగారి కొలువులో ఉద్యోగం ఇప్పించడం చాలా తేలిక. ఆ తర్వాత, తన కూతురుమల్లికనిచ్చి పెళ్ళిచేసి తన ఇంటనే వుంచుకోవచ్చు!

సింగన్న ఇలా ఆలోచించి, మర్నాడు కొండయ్యకు సంగతి చెప్పాడు. వాడు రాజుగారి కొలువులో ఉద్యోగం అంటే సంతోషపడ్డాడు కానీ, మల్లికతో పెళ్ళి అంటే ఏమాత్రం ఇష్టంలేదు. అయితే, వాడాసంగతి బయటపెట్టకుండా, ముందుకోటలో పాగా కోసం, సరేనన్నట్టు తల ఊపాడు.

మొదట సింగన్న, కొండయ్యకు సైనికుడి ఉద్యోగం ఇప్పించాలని చూశాడు. అందుకు వాడు ఒప్పుకోలేదు. డాలూ కత్తీ పట్టి, నగరం వదిలి ఎక్కడెక్కడో కొండల్లో, అడవుల్లో తిరగడం తనకు ఇష్టంలేదన్నాడు. సరే, నగరంలోనే రాత్రివేళ గస్తీ తిరిగే భటుడి ఉద్యోగం వేయిస్తానన్నాడు సింగన్న. దానికి వాడు ఒప్పుకోక, ఏ ఈటో పట్టుకుని చీకట్లో

మల్లవరపు మనోహరరెడ్డి



కాళ్ళరిగేలా వీధుల వెంట తిరగడం, నాకు ఈచిన్నతనంగా వుంటుంది, అనేశాడు.

ఈ సంభాషణ విన్న మల్లిక, కొండయ్య అడక్కుండానే రాత్రిళ్ళు కోటలో జాము జాముకు గంటలు కొట్టి సమయం తెలియ జేసేవాడి పని ఇప్పించింది.

వాడు ఉద్యోగంలో చేరి రోజులూ, వారాలూ గడిచి నెల ముగిసిపోయినా, రాకుమారి వాడికంట బడలేదు. వాడిక వుండబట్టలేక, ఆ ప్రాంతాల మొక్కలకు పాదులు చేసే వృద్ధుడొకడిని రాకుమారి ఇటుకేసి ఎప్పుడొస్తుందని అడిగాడు.

దానికి వృద్ధుడు నవ్వి, "రాకుమారిగారికి ఇటు రావలసిన అవసరమేమిటి! ఆమె దూరాన ఎత్తయిన ఆ గోడ అవతలనున్న పూలతోటలో చెలికత్తెలతో కలిసి విహారం చేస్తుంది. అక్కడే కొలనులో జలకాలాడు తుంది. తర్వాత అంతఃపురానికి వెళ్ళి పోతుంది. అంతగా రాకుమారిని చూడాలని వుంటే, ఒకటి, రెండు నెలలు ఓపిక పట్టు. రాజుగారామెకు పెళ్ళి సంబంధాలు చూస్తు న్నారు. పెళ్ళి ముహూర్తం నాడు, మనబోటి వాళ్ళందరం ఆమెను చూడవచ్చు," అన్నాడు.

రాకుమారికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నా రన్నమాట వినగానే, కొండయ్యకు గుండె పట్టినట్టయింది. వాడిక ఆలస్యం చేస్తే, ఆమె చేయిజారిపోతుందని, ఒక ఉపాయం ఆలోచించాడు. దాని ప్రకారం వాడు మర్నాటి సంధ్యవేళ రాకుమారికి పూలు తీసుకుపో తున్న దాసీని పలకరించి మాటల్లో పెట్టి, అంతకు ముందే రాసివుంచుకున్న చీటీని, దాసీకి తెలియకుండా, ఆమె చేతనున్న పూలబుట్టలో జారవిడిచాడు.

దానిలో వాడు –"మీకోసం నేను రాజ ధానికి పది ఆమడలదూరంలోవున్న పల్లె నుంచి వచ్చాను. ఇందుకు నేను, ఒక చిట్టడవినీ, రెండు చిన్ననదులనూ దాట డమేగాక, కొండప్రాంతాల నడిచి ఎన్నో శ్రమల కోర్చాను. ఇదంతా మీ కోసమే. ఇప్పుడు రాత్రివేళ గంటలు కొట్టే చాకిరీ కూడా మీ కోసమే చేస్తున్నాను – కొండాపురం కొండయ్య," అని రాశాడు.

అయితే, దాసీది పూలబుట్టతో వెళ్ళి పోయాక, కొండయ్యను రకరకాల భయాలు పట్టుకున్నవి. రాజుకు కోపం వస్తే చండ శాసనుడని చెప్పడానికి, కోటలో ఉద్యోగుల మధ్య అనేక కథలు ప్రచారంలో వున్నాయి. ఒక వేళ తన రోజులు బాగోక, రాకుమారి

ఒళ్ళుమండి చీటీని రాజుకు చూపిస్తే, తన పరిస్థితి ఏమవుతుందో అని వాడికి దిగులు పుట్టింది. తను చేసినపని కొరివితో తల గోక్కోవడంలాంటిదని వాడు చింతింప సాగాడు. క్రమంగా వాడారాత్రి మతిస్థిమితం తప్పి ఉన్మాదిలా ప్రవర్తించాడు.

ఆ రాత్రి కొండయ్య మొదటి జామున కొట్టవలసిన గంట కొట్టనేలేదు. రెండోజామున ఏకంగా మూడుగంటలు మోగించాడు.

మూడుసార్లు గంట మోగేసరికి, రాజు దిగ్గున హంసతూలికాతల్పం మీద లేచి కూర్చున్నాడు. రోజూ ఆయనకు రాత్రిమూడో జామున నిద్రలేచే అలవాటున్నది. దాసీలు వచ్చి తనను మేలుకొలపనందుకు ఆయన ముందు ఆశ్చర్యపోయి, తర్వాత కోపంగా చప్పట్లు చరిచాడు.

ఆ చప్పట్లు విని బిలబిలమంటూ అక్కడికి వచ్చిన దాసీలను ఆయన గట్టిగా కసిరాడు. తర్వాత కాలకృత్యాలు తీర్చుకుని ఉపాహారంకోసం వస్తే, వంటగది చీకటిమయంగా వున్నది. హతాశుడైన రాజు, ఇలా ఎందుకు జరిగిందా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఐతే, ఎంతకూ నాలుగో గంట మోగనే లేదు. అప్పుడాయన కాపలా భటుణ్ణి పిలిచి ప్రశ్నిస్తే, మూడోజాము సగంలోనే వున్నదని తెలిసింది. దాంతో ఆగ్రహించిన రాజు, కొండయ్యకోసం భటుల్ని పంపాడు.

రాజు నుంచి కబురందగానే, చీటీవిషయం ఆయనకు తెలిసిపోయివుంటుందనీ, ఇక తనకు ఏ ఉరిశిక్షో, ఉప్పు పాతరో తప్పదనీ అనుకున్నాడు, కొండయ్య. వాడు అక్కణ్ణించి పారిపోవాలని అటూ ఇటూ చూశాడు. కాని,



ఈటెలు పట్టిన ఇద్దరు భటులు వాడికేసి గుడ్లురుముతూ చూస్తున్నారు. వాడు జారిపోతున్న గుండెను చిక్కబట్టుకుని భటుల వెంట బయల్దేరాడు.

కొండయ్యను చూసి రాజు మండిపడి, "ఒరే, నువ్వేనా రాత్రివేళ జాముగంటలు కొట్టేది?" అని ప్రశ్నించాడు.

కొండయ్యకు జవాబిచ్చేందుకు గొంతు పెగలక, అవునన్నట్లుతలవూపాడు వణుకుతూ.

ఇది చూసి రాజుకు వాడిపై జాలికలిగింది. ఆయన ఈసారి కాస్త మృదువుగా, "ఒరే, ఎన్నాళ్ళుగా ఈ ఉద్యోగం చేస్తున్నావు?" అన్నాడు.

"మహారాజా! రెండో నెలగడవబోతున్నది," అని జవాబిచ్చాడు కొండయ్య తడబడుతున్న గొంతుతో. రాజు, వాణ్ణి ఒకసారి పరీక్షగా

చూసి, "మంచి ఒడ్డూ పొడుగూ, ఇంత దేహదారుఢ్యం వున్న నీకు, ఏ సైనికుడి ఉద్యోగమో ఇవ్వక, ఇక్కడ రాత్రివేళ గంటలు కొట్టే చచ్చుపని ఇచ్చిన వాళ్ళెవరో తెలియదు. సరే, ఒక్కవారం రోజులపాటు ఒళ్ళు దగ్గర పెట్టుకుని పనిచెయ్యి. తర్వాత నిన్ను, సేనానాయకుడికి చెప్పి సైన్యంలో చేరేలా చూస్తాను. నువ్వు కత్తిబట్టి మన సరిహద్దుల్లో నిలబడితే, శత్రుసైనికులు తిరిగి చూడకుండా పారిపోగలరు!" అన్నాడు నవ్వుతూ.

కొండయ్య, రాజుకు నమస్కరించి బతుకు జీవుడా అనుకుంటూ అక్కణ్ణించి బయలుదేరాడు. కాని, వాడికి తను రాకుమారికి రాసిన చీటీ సంగతి ఏ క్షణాన్నయినా రాజుకు తెలిసిపోతుందనీ, అప్పుడు తనను రాజు కఠినంగా శిక్షిస్తాడనీ బెంగ కలిగింది.

వాడు తలవంచుకుని కోటద్వారం కేసి నడుస్తూండగా, మల్లిక వాడికి ఎదురుపడి, "ఆహా, బావా! నువ్వా దిక్కుమాలిన పల్లె వదిలి ఇక్కడికి వచ్చింది నా కోసమని నేనెరగననుకున్నావా? నాకు నీ మనసులో ఏమున్నదీ తెలియజెప్పటానికి పూలబుట్ట దొరికిందా? పూలమాలలు నేనే కట్టి రాకుమారిని అలంకరిస్తూంటాను గనక, ఆ చీటీ నాకు దొరికింది. ఏదైనా పొరబాటు జరిగి అది రాకుమారి చేతబడి వుంటే – ఆ చీటీ ఆమెకు రాశావని ఆగ్రహించి, నీ తల కోట గుమ్మానికి వేలాడదీయించేది. నాన్న నేడో రేపో మనపెళ్ళికి ముహూర్తంపెట్టించే ప్రయత్నంలో వున్నాడు. అయినా, చీటీలో కూడా నా పేరు రాయడానికి అంత సిగ్గా నీకు? ఏమైనా, పల్లె కుర్రాడివనిపించావు!" అని నవ్వుతూ రాకుమారి వుండే అంతఃపురాని కేసి పరిగెత్తింది.

మల్లిక మాటలతో కొండయ్యకు తల మీదినుంచి కొండంత బరువు దిగిపోయినట్టయింది. వాడు తేలికపడ్డ మనసుతో, "బుద్ధిమాలి నేరక చేసిన తప్పుకు కొంచెంలో ఎంత ప్రమాదం తప్పింది? నా బోటివాడు తనకు తగ్గ ఆలోచన చేయాలి కానీ, ఆకాశానికి నిచ్చెన వేయాలనుకుంటే ఇలాగే జరుగుతుంది. లేనిపోని భయాలతో ఎంత చావు చచ్చాను! మల్లిక అడ్డుకోకపోతే, ఈరోజు నా గతేం కాను? రాకుమారి వద్దనే వద్దు. మల్లికే నాకు తగిన భార్య!" అనుకున్నాడు.



# బంగారు గడియలు-12





**1. ... భూమధ్యరేఖ సమీపంలో పెంగ్విన్ పక్షులు?**
ప్రపంచం మొత్తం మీద ఈ దీవుల సముదాయంలోనే ఉష్ణప్రాంతాల జంతువులైన తాబేళ్ళు, పెద్ద ఇగూనా బల్లులతో పాటు పెంగ్విన్ పక్షులు పక్కపక్కనే సహజీవనం సాగిస్తున్నాయి!

## ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?

**2. ... అతిచిన్న దేశం?**
ఇది అర చ.కి.మీ వైశాల్యంతో వెయ్యి మంది జనాభా గల అతిచిన్న దేశం. 1929 నుంచి ప్రత్యేక పతాకం, తపాలా బిళ్ళలు, జాతీయ గీతం కలిగి ఉన్నది.



**3. ... ఎత్తయిన సరస్సు?**
సముద్ర మట్టానికి 3811 మీ॥ ఎత్తులోవున్న టిటికాకా సరస్సుపొడవు 190కి.మీ. లోతు 275 మీ. ఇది 9065 చ.కి.మీ.విస్తరించిఉన్నది.





**4. ... ఎక్కువ వెడల్పుగల పొడవాటి వంతెన?**
దీనిని ఆ ప్రాంతంలో 'ఓల్డ్‌కోట్ హ్యాంగర్' అని పిలుస్తారు. దీనిపై రాకపోకలు 1932వ సం॥లో ప్రారంభమయ్యాయి. 48.8 మీ॥ వెడల్పుగల ఈ వంతెన మీద 8 వరుసలలో వాహనాలు నడుస్తాయి.



**5. ... ఎలుకలను గౌరవించే ఆలయం?**
తెల్ల చలువరాళ్ళతో నిర్మించబడిన ఈ కార్ని మాతా ఆలయంలో ఎలుకలను భక్తితో చూస్తారు. వాటికి తిండి పెడతారు; రక్షణ కల్పిస్తారు.

కథా ప్రహేళిక

డేనియల్ డీఫో రచించిన రాబిన్‌సన్ క్రూసో నవల నుంచి ఈ భాగం ఇవ్వబడింది. ఈ పేరాలో డీఫో ఒక చిన్న పొరబాటు చేశాడు. ఆ పొరబాటు ఏమిటో కనుగొనగలరా?



"మధ్యాహ్నం కొంతసేపు గడిచాక, సముద్రం చాలా ప్రశాంతంగా ఉండడం చూశాను. వాతావరణం మరీ వేడిగా ఉండడం వల్ల బట్టలు తీసేసి నీళ్ళలోకి దిగాను. చాలాసేపు తరవాత నేను ఓడ దగ్గరికి తిరిగి వచ్చాను. కాని ఓడ మీదికి వెళ్ళడం ఎలాగో తెలియక తికమకపడ్డాను. ఆఖరికి ఓడలోని ఒక మూల నుంచి వేలాడుతున్న ఒక తాడును కనుగొన్నాను.... దాని సాయంతో ఓడ ముందు భాగానికి ఎగబ్రాకాను. ఓడలోని ఆహార పదార్థాలు సముద్రపునీళ్ళలో తడవకుండా పొడిగా, తినడానికి పనికివచ్చేవిగా ఉన్నాయి. నేను అవివున్న గదిలోకి వెళ్ళి బిస్కట్లు తీసి నా జేబులను నింపుకుని వచ్చి నెమ్మదిగా తిన్నాను...."

చేసి చూడండి

# పక్షిని బంధించండి



కార్డ్‌బోర్డ్‌లో 4×4 సెం.మీ. కొలతతో చదునైన ముక్కను కత్తిరించుకోండి.

అట్టకు నిలువున రెండు వైపులా దారాల ఉంగరాలు ముడివేయండి.

అట్టకు ఒక వైపున పక్షిబొమ్మనూ,రెండవవైపున గూటిబొమ్మనూ గీసుకోండి.

అట్టను దారాలతో లాగి పట్టుకుని వేగంగా తిప్పండి. అలా తిప్పుతున్నప్పుడు పక్షి గూటిలో బంధించబడినట్టు కనిపిస్తుంది!



# సరదా ప్రశ్నలు

1. గుర్రానికి ఆరుకాళ్ళు ఎప్పుడు ఉంటాయి?
2. చిట్టెలుకా, ఏనుగూ ఒకే బరువు ఎప్పుడు కలిగి ఉంటాయి?



3. **9+9+9+1+1** కలిపి కూడితే 20 ఎప్పుడు వస్తుంది?
4. నేను నా స్నేహితుడి ఇంటికి వెళ్ళాను. అక్కడి నుంచి బయలుదేరబోతూండగా, స్నేహితుడి తమ్ముడు వచ్చి, "అడ్డుదారి గుండా వెళ్ళవద్దు. అక్కడొక పాము పడుకుని ఉంది. విష సర్పంలా కనిపిస్తున్నది," అన్నాడు. "దాన్ని నువ్వెలా దాటుకుని వచ్చావు?" అని అడిగాను నేను. "నేను వచ్చేప్పుడది కళ్ళు మూసుకుని నిద్రపోతున్నది. ఇప్పుడది మేలుకుని ఉండొచ్చు," అన్నాడతడు.

   నన్ను సరదాగా ఆటపట్టించడానికి అతడలా అంటున్నాడని గ్రహించి నేను అడ్డుదారి గుండానే మా ఇల్లు చేరాను. ఊహించినట్టే దారిలో పాము కనపించలేదు.

   స్నేహితుడి తమ్ముడు అబద్ధం చెబుతున్నాడని ఇతడెలా గ్రహించాడో చెప్పగలరా?



5. ఏనుగుకు ఎప్పుడు ఎనిమిది కాళ్ళుంటాయి?
6. రెండు (హ్యాండ్స్) చేతులుండీ ఎన్నడూ ముఖం కడుక్కోనిది ఏది?



7. గొంతు ఉండీ మింగలేనిది ఏది?
8. యుద్ధంలో ఒక చేతిని కోల్పోయిన ఫ్రెంచి సైనికుడొకడు నెపోలియన్ బోనపార్ట్ దగ్గరికి వచ్చాడు. నెపోలియన్ అతని సాహసాన్ని మెచ్చుకుని అతనికి పతకం ఇచ్చి, "ఇది నువ్వు కోల్పోయిన చేయికోసం!" అన్నాడు.

   "మరి, నేను రెండవచేయిని కూడా కోల్పోయి ఉన్నట్టయితే తమరేం బహుమతి ఇచ్చేవారు?" అన్నాడు సైనికుడు.

   "నిన్నొక ఉన్నత అధికారిగా నియమించి



   ఉండే వాణ్ణి!" అన్నాడు నెపోలియన్.

   మరుక్షణమే సైనికుడు ఒర నుంచి కత్తి లాగి రెండవ చేతిని తెగ నరుక్కున్నాడు.

   ఈ ఉదంతం నిజమనుకుంటున్నారా? కాదు, అంటే ఎలా గ్రహించగలిగారు?

## మంచుమనిషిబొమ్మ గీయండి!

అంకె 3ను కొన్ని గీతలతో మంచుమనిషిగా మార్చవచ్చు!



అంకె 8ని నడుస్తూన్న కీటకంలాగా కనిపించేట్టు చేయవచ్చు.



## బంగారు గడియలు నెం.11 సమాధానాలు

### ప్రపంచంలో ఎక్కడ

1. ఇండొనేషియాలోని మధ్యజావా.
2. కాలిఫోర్నియా, అమెరికాలోని శ్వేతపర్వతాలలో.
3. లండన్‌లోని థేమ్సనదీ తీరంలో.
4. ఇటలీలోని వెనిస నగరంలో.

### చిత్ర ప్రహేళిక

కొలంబస్ ఓడలో చుక్కలు, చారలుగల అమెరికా పతాకం ఎగురుతున్నది.

### పిక్చర్ క్విజ్

1. 35 త్రికోణాలు.
2. 
3. వాటన్నిటినుంచీ.

### సరదా ప్రశ్నలు

1. గాలి లేని టైరు బూటీలో ఉన్నది.
2. దారం రెండవకొన దేనికీ కట్టబడలేదు.
3. విండ్‌షీల్డ్ వైపర్స్ చేసిన తడిచారలు ఒక కారులో మాత్రమే కనిపించాయి.
4. అంధుడికి చూపులేదుగాని మూగ కాదు కదా! రంపం కావాలని అడిగాడు.




దుర్వాసుడికీ, ఆయన శిష్యులు వెయ్యి మందికీ, వేళగానివేళ, ఎలా భోజనం సమకూర్చాలో తెలీక ద్రౌపది కృష్ణుణ్ణి ప్రార్థించగానే, అరణ్యంలో ద్రౌపది ఎదట కృష్ణుడు ప్రత్యక్షమయ్యాడు. ద్రౌపది కృష్ణుడి పాదాలకు నమస్కరించి, "దుర్వాసుడు తన శిష్యగణంతో గంగ నుంచి తిరిగివచ్చి భోజనం పెట్టమంటాడు. అక్షయపాత్రలో ఒక్కమెతుకైనాలేదు. నేనేం చేసేది?" అన్నది.

"దుర్వాసుడి మాట దేవుడెరుగు. ముందు నాకు ఆకలి మండిపోతున్నది. నా ఆకలి తీర్చు," అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది సిగ్గుపడుతూ, "నేను తినే దాకానే పాత్రలో అన్నం ఉంటుంది. నా భోజనం అయిపోయింది. నువ్వే నన్ను పరీక్ష పెడితే నా కేది దారి?" అన్నది.

"నేను ఆకలితో చచ్చిపోతుంటే నీకు హాస్యంగా ఉన్నట్టున్నది. నీ అక్షయపాత్రలో ఎంత ఉంటే అంతే పెట్టు. దాన్ని తీసుకురా, చూస్తాం," అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది వెళ్ళి అక్షయపాత్ర తెచ్చింది.దానిలో ఏ మూలనో ఒక మెతుకు అంటుకుని ఉన్నది. కృష్ణుడు దాన్ని నోట వేసుకుని, "నా కడుపు నిండిపోయింది!" అన్నాడు.

అతను భీముణ్ణి పిలిచి, "నువ్వు గంగకు వెళ్ళి, దుర్వాసుణ్ణీ, ఆయనగారి శిష్యులనూ భోజనానికి త్వరగా రమ్మని పిలుచుకురా," అన్నాడు.

భీముడు వచ్చే లోపుగానే దుర్వాసుడికీ శిష్యులకూ పొట్టలు ఉబ్బరించి, త్రేపులు రాసాగాయి. శిష్యులు దుర్వాసుడి దగ్గరికి వచ్చి, "స్వామీ, గొంతుపూడేదాకా తిన్నట్టుగా ఉన్నది. మనం అనవసరంగా ధర్మరాజును వంట చేయించమన్నాం. ప్రస్తుత స్థితిలో ఒక్క మెతుకు కూడా తినలేం. ఇప్పుడేం చెయ్యాలి?" అన్నారు.



దుర్వాసుడు వాళ్ళతో, "ధర్మరాజుకు ద్రోహమే చేశాం. అతను సామాన్యుడుకాడు. మన కేసి కోపంగా చూస్తే మాడి మసి అయి పోతాం. అంబరీషుడి వల్ల నా కొకసారి పరా భవం ఇలాగే జరిగింది. మనం చెయ్యగలది ఒకటే ఉన్నది. ధర్మరాజుకు చెప్పకుండా పారిపోదాం," అన్నాడు.అందరూ గంగ నుంచి అటే వెళ్ళిపోయారు.

అంబరీషుడు ఒకసారి ద్వాదశీవ్రతం చేసి,బ్రాహ్మణులతో సహా భోజనానికి కూర్చో బోతూండగా దుర్వాసుడు వచ్చాడు. అంబరీ షుడు ఆయనను భోజనానికి రమ్మని ఆహ్వా నించాడు. దుర్వాసుడు స్నానానికి వెళ్ళి ఎంతకూ రాలేదు. ద్వాదశి ఘడియలుదాటి పోతున్నాయి. ద్వాదశి వెళ్ళాక పారణ చేస్తే వ్రత ఫలితం దక్కదు. అతిథి రాకుండా భోజనం చెయ్యటం పాపం. అందుచేత అంబరీషుడు మధ్య మార్గంగా నీరు తాగాడు. దుర్వాసుడు ఆలస్యంగా వచ్చి, అంబరీషుడు జలపానంచేసినట్టు తెలిసి ఆగ్రహించి, మహా కృత్యను సృష్టించి, అంబరీషుడి పైకి పంపకం చేశాడు. ఇంతలో విష్ణుచక్రంవచ్చి, కృత్యను చంపి, దుర్వాసుడి వెంట బడింది. అప్పుడు దుర్వాసుడు శివుడి వద్దకూ, విష్ణువు వద్దకూ వెళ్ళి, వారు రక్షించ లేకపోగా, తిరిగివచ్చి అంబరీషుడి కాళ్ళపైనేపడి, ప్రాణాలు దక్కిం చుకున్నాడు. ఇది దుర్వాసుడికి మరవరాని అనుభవం.

భీముడు గంగా తీరానికి వచ్చేసరికిఅక్కడ ఒక్కరూలేరు. అక్కడ ఉండే బ్రాహ్మణు లను అడిగితే, "మునులందరూ పారిపో యారే!" అని చెప్పారు. భీముడు ఆశ్రమానికి తిరిగి వచ్చి ఆ మాట చెప్పాడు. దుర్వాసుడు మళ్ళీ ఏ వేళగానివేళ వస్తాడోనని ధర్మరాజు భయపడ్డాడు.

కృష్ణుడు ఆయనతో, "దుర్వాసుడు ఇక రాడు!" అంటూ జరిగిన సంగతి చెప్పి, సెలవు పుచ్చుకుని తిరిగి వెళ్ళిపోయాడు. కృష్ణుడి అనుగ్రహంవల్ల పాండవులను దుర్యోధనాదులు ఇలాటి కష్టాలకు గురి చేయలేకపోయారు.

కొంతకాలం గడిచింది. పాండవులు కామ్యకవనంలోనే ఉంటూ ఒకనాడు వేటకు వెళ్ళ నిశ్చయించారు. తాము తిరిగి వచ్చేదాకా వారు ద్రౌపదిని తృణబిందుడు అనే ఋషి ఆశ్రమంలో ఉంచి, ఆమెకు తమ పురోహితు డైన ధౌమ్యుణ్ణి తోడు ఉంచారు. అదే రోజు సైంధవుడు సాళ్వరాజు కుమార్తెను పెళ్ళాడా

లని, కొంత సైన్యాన్నీ, అనేకమంది రాజులనూ వెంటబెట్టుకుని, తృణబిందు ఆశ్రమం పక్కగా వెళుతున్నాడు. ఆశ్రమం నిర్జనంగా వున్నది. ఒక పొదరింటి ద్వారంవద్ద ద్రౌపది, మెరుపు తీగలాగా వెలిగిపోతూ నిలిచి ఉండటం సైంధవుడికి కనిపించింది.

ఆమెను చూడగానే సైంధవుడి కళ్ళు జిగేలుమన్నాయి. అతనిలో మోహం పుట్టు కొచ్చింది. అతను కోటికాస్యుడనే రాజ కుమారుణ్ణి పిలిచి, "ఒరే, ఆ స్త్రీని చూశావా? ఆమెను చూస్తే నాకు ఎక్కడలేని కోరికా కలుగుతున్నది. నాకు సాళ్వరాజు కుమార్తె వద్దు. ఈమె ఎవరి కూతురో, ఎవరి భార్యో, నాతో వచ్చేస్తుందేమో నువ్వు వెళ్ళి కనుక్కురా," అన్నాడు.

ఆ కోటికాస్యుడు కూడా మానాభిమా నాలు లేనివాడే. వాడు ద్రౌపది దగ్గరికి వచ్చి, "సుందరీ, నువ్వెవరు? వనదేవత లాగున్న నీకు భర్త ఎవరు? ఏ కులం దానివి? నీ పేరేమిటి? ఈ వనంలో ఒంటరిగా ఎందుకున్నావు? మా సంగతి నువ్వు అడగక పోయినా చెబుతాను. నేను సురథ రాజు కొడుకును, నా పేరు కోటికాస్యుడు. ఆ కన బడే రాజులు త్రిగర్తరాజూ, కుళిందరాజూనూ. నీ వంక ఆత్రంగా చూస్తున్న యువకుడు సుబలరాజు కుమారుడు. పన్నెండుమంది రాజుల మధ్య వెలిగిపోతున్న రథం మీద కూర్చున్న వాడు సింధు సౌవీర దేశాలకు రాజు, జయద్రథుడు. ఆ జయద్రథుడే నీ సంగతి కనుక్కురమ్మని నన్ను పంపించాడు," అన్నాడు.

ద్రౌపది అతనితో, "నువ్వు ఎవరో నాకు తెలుసు. నా వంటి కులస్త్రీలు నీతో మాట్లా డరాదు. కాని నీ ప్రశ్నలకు జవాబు చెప్పటానికి ఇక్కడ ఎవరూ లేరు. అందుచేత విధి లేక నేనే చెబుతున్నాను. నేను ద్రుపదరాజు





కూతురిని. నన్ను కృష్ణ అని పిలుస్తారు. పాండవులు నా భర్తలు. వారిప్పుడు వేటకు పోయి ఉన్నారు, త్వరలోనే వస్తారు. వారు వచ్చేదాకా మీరంతా ఆగి, వారి అతిథి సత్కారాలు పొంది వెళ్ళండి. వారు సంతోషిస్తారు," అన్నది.

కోటికాస్యుడు వెళ్ళి సైంధవుడితో సంగతి అంతా చెప్పాడు.

"ఆమె మనుష్య స్త్రీ అంటే నమ్మశక్యం కాకుండా ఉన్నది. ఆమెను చూసిన కళ్ళతో మరొక స్త్రీని చూడటం సాధ్యం కాదు," అన్నాడు సైంధవుడు.

సైంధవుడు తన రథం దిగి, తన వారిని ఆరుగురిని వెంటబెట్టుకుని పాండవులపర్ణశాలకు వెళ్ళి, దౌపదితో, "నువ్వూ, నీ భర్తలూ క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు.

ద్రౌపది అతన్ని క్షేమసమాచారాలడిగి అర్ఘ్య పాద్యాలిచ్చింది. ఆమె అతన్ని కూర్చోమని, "పాండవులు వేట నుంచి తిరిగివచ్చి, మీకు వేటమాంసంతో భోజనం పెడతారు," అన్నది.

"ఆతిథ్యాని కేముందిగాని, నా రథంమీద మా నగరానికి వచ్చెయ్యి. నిన్ను నా భార్యగా చేసుకుని, సుఖాలలో ముంచి ఎత్తుతాను. రాజ్యభ్రష్టులైన పాండవుల వెంట ఈ అరణ్యాలలో ఎందుకు ఇక్కట్లు పడతావు? సింధుసౌవీర దేశాలను నువ్వే ఏలుకో!" అన్నాడు సైంధవుడు.

ద్రౌపదికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. తన భర్తలు వచ్చేదాకా సైంధవుణ్ణి మాటలలో పెట్టదలచి ఆమె, "నువ్వు ఎంత తెలివి మాలినవాడివి! నా భర్తలు ఇంద్రుడికి తీసిపోనివాళ్ళు కదా, వారికి ఆగ్రహం తెప్పించటం నీకు ఎంత ప్రమాదకరం!" అంటూ ధర్మాలు చెప్పసాగింది.

"పాంచాలీ, పాండవులను గురించి మాకు కొత్తగా చెప్పి భయపెడదామనుకుంటున్నావా! లాభం లేదు. లోకంలో ఉన్న పదిహేడు ఉన్నత కులాలలో మాది ఒకటి. ఊరికే మాటలలో పెట్టక, నా వెంటవచ్చెయ్యి, పాండవులకు భయపడి నిన్ను వదిలిపోతాననుకోకు," అన్నాడు సైంధవుడు.

ద్రౌపది మండిపడి, "ఓరీ, అధముడా, పాంవులభార్య నీకు అంతసులువుగా చిక్కుతుందనుకుంటున్నావా? నీ వెనకగా అర్జునుడు రథంమీద వచ్చి, నిన్ను కార్చిచ్చులాగా దహించడా? నన్ను తీసుకు పోవటం ఇంద్రుడి తరం కూడా కాదు, నువ్వెంత? నేనై నిన్ను

వరిస్తానను కోవటం భ్రమ. నేను మహా పతి వ్రతను. నా మనసు పాండవుల పైన తప్ప ఇతరులపైన పోదు," అన్నది.

సైంధవుడి వెంట వచ్చిన వాళ్ళు ద్రౌపదిని పట్టుకోబోయారు. ద్రౌపది వాళ్ళకు చిక్క కుండా, ధౌమ్యుడికి వినిపించేటట్టు గట్టిగా కేకలు పెట్టింది. సైంధవుడు ఆమెను రెండు చేతులా పట్టుకుని ఎత్తి పరిగెత్తసాగాడు. ద్రౌపది కేకలు విన్న ధౌమ్యుడు సైంధవుడి వెనకగా పరిగెత్తుకుంటూ రాసాగాడు. ఆయన కూడా కేకలు పెట్టాడు.

సైంధవుడు ద్రౌపదిని రథంమీద ఎక్కించుకుని బయలుదేరాడు.

ధౌమ్యుడు సైంధవుడితో, "సైంధవా, ఏంపని ఇది? చేతనైతే ఆమెభర్తలను ఓడించి ఆమెను పట్టుకుపో గాని, పరస్త్రీని ఇలా బలాత్కారంగా తీసుకుపోవచ్చునా?" అన్నాడు. సైంధవుడు వినిపించుకోక రథాన్నిపోనిచ్చాడు. ధౌమ్యుడు ఆ రథం వెనకగా పరిగెత్తాడు.

ఈలోపుగా పాండవులు కొన్ని మృగాలను వేటాడి ఒక చోట కలుసుకుని, ఆశ్రమానికి బయలుదేరారు. వారు ఆశ్రమం చేరేసరికి ద్రౌపదికనిపించలేదు. సారథి అయిన ఇంద్ర సేనుడికి ధాత్రేయిక అనే స్త్రీ ఏడుస్తూ కనిపించింది. ఆమె ఇంద్రసేనుడితో ద్రౌపదిని సైంధవుడు బలాత్కారంగా రథంలో పెట్టుకుని తీసుకుపోయాడనీ, అది జరిగి ఎంతోసేపు కాలేదనీ చెప్పింది.

ధర్మరాజు ధాత్రేయికతో ఏడవ వద్దని చెప్పి, తన తమ్ములతో వెంటనే సైంధవుడి మీదికి పోదామన్నాడు. అయిదుగురూ రథాలెక్కి, సైంధవుడి సేనలు వెళ్ళిన జాడలను బట్టి బయలుదేరారు. త్వరలోనే వారికి దుమ్ము రేగుతూ దూరాన కనిపించింది. తరవాత వారికి ధౌమ్యుడు పరిగెత్తుతూ కనిపించాడు. ఆయనను నింపాదిగా రమ్మని చెప్పి, పాండవులు మాంసం మీదికి ఉరికే డేగల్లాగా సైంధవుడి సేన మీదికి ఉరికారు.



సేన మధ్యలో రథం మీద సైంధవుడి వెంట ద్రౌపది కనిపించగానే వారికి ఒళ్ళు తెలియనికోపంవచ్చింది. "ఆగండి! ఆగండి!" అని కేకలుపెడుతూ వాళ్ళు సైంధవుడిరథాన్ని చేరుకున్నారు. వారిని చూసి సైంధవుడి వెంట ఉన్నవారు భయపడ్డారు.

ద్రౌపది సైంధవుడితో, "అరుగో, నాభర్తలు వస్తున్నారు. నువ్వూ, నీ సైన్యమూ సర్వ నాశనం కాబోతున్నది. నీకు కాలం మూడటం చేతనే ఈ పాడు పని చేశావు. ఈసారి నువ్వు

చావక బతికావంటే అది నీకు పునర్జన్మే అనుకోవాలి," అన్నది.

పాండవులు సైంధవుడిసేనమీద బాణ వర్షం కురిపించారు. సైనికులు చెల్లాచెదురుగా పారిపోసాగారు. భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి పోబోతే కోటికాస్యుడు అడ్డుపడ్డాడు. వాడికి సహాయంగా చాలా రథికులు వచ్చి, భీముడి మీద శక్తులూ, తోమరాలూ, ఇతర ఆయుధాలూ విసిరారు.

అర్జునుడు సైంధవుడి రథాన్ని చేరుకునేటందుకు దారిలో అడ్డువచ్చిన పదిహేనుమందిని చంపేశాడు. ధర్మరాజు నూరుగురు సౌవీరులను చంపాడు. నకులుడు రథం నుంచిదిగి సైనికులను చంపసాగాడు. సహదేవుడు ఏనుగుల మీద ఎక్కిన వారందరినీ చంపాడు. త్రిగర్తరాజు, ధర్మరాజు చేతిలో చచ్చాడు.

సైంధవుడి పక్షంవాళ్ళు చాలామంది చచ్చారు. కోటికాస్యుడు పారిపోయాడు. చివరకు చేసేదిలేక సైంధవుడు ద్రౌపదిని రథం మీదనేవిడిచి, తానుప్రాణాలు దక్కించుకుని పారిపోబోయాడు. అర్జునుడు ఆసంగతి భీముడికిచెప్పాడు. భీముడు అనాథలైన సైనికులను చంపటం నిలిపి, ధర్మరాజుతో, "అన్నా, నువ్వు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీ నీరథంలో ఆశ్రమానికి తీసుకుపో. నేనూ, అర్జునుడూ వెళ్ళి ఆ సైంధవుడి సంగతి తేల్చుతాము," అన్నాడు.

"భీమసేనా, సైంధవుడు ఎంత దుర్మార్గుడైనావాణ్ణి చంపవద్దు. దుశ్శల విధవ కారాదు, గాంధారికిశోకం తెప్పించరాదు," అని ధర్మరాజు భీముణ్ణి హెచ్చరించాడు. కాని ద్రౌపది మాత్రం సైంధవుణ్ణి ప్రాణాలతో వదలరాదన్నది. ధర్మరాజు ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు.

ఒక కోసుదూరాన భీమార్జునులకు సైంధవుడుదొరికాడు. భీమార్జునులు సైంధవుణ్ణి పట్టుకుని, తలగొరిగి, పంచ శిఖలు పెట్టి, వికారంగా తయారుచేసి, మట్టికొట్టుకుని ఉన్న ఆ సైంధవుణ్ణి రథంలో పెట్టుకుని ఆశ్రమానికితెచ్చి ధర్మరాజు ముందు పెట్టారు.

"ఇక ముందు నువ్వు ఎక్కడికి వెళ్లినా పాండవదాసుణ్ణి అని చెప్పుకు బతుకు,"అని భీముడు, ద్రౌపది అంగీకారంతో సైంధవుణ్ణి వదిలిపెట్టాడు.

"ఇక ఎన్నడూ ఇలాటి నీచపు పని చెయ్యకు," అని మందలించి, ధర్మరాజు సైంధవుణ్ణి పంపేశాడు.



# చందమామ కబుర్లు

## వృషభ సంవత్సరం



చైనా దేశస్థులు తమ పురాణాలలో చోటుచేసుకున్న జంతువుల పేర్లను సంవత్సరాలకు పెట్టుకున్నారు. ప్రతి సంవత్సరానికీ ఒకొక్కక్క జంతువు పేరు పెట్టాలంటే సాధ్యంకాదు-కాబట్టి పన్నెండు సంవత్సరాలకు పన్నెండు జంతువుల పేర్లు పెట్టారు. ఒకసారి పన్నెండు సంవత్సరాలు పూర్తయిన తరవాత అవే పునరావృతమవుతాయి. ఆవిధంగా ఫిబ్రవరి 8వ తేదీ ఆరంభమయిన ఈ సంవత్సరం పేరు వృషభం. ఈ నూతన సంవత్సరారంభంలో బంధుమిత్రులను కలుసుకోవడం, కొత్తబట్టలు కొనడం, సంప్రదాయ విందులు, వినోదాలు, జనంరద్దీ, ట్రాఫిక్‌జామ్ అన్నీ యధాప్రకారం జరిగాయి. వచ్చేజూలైలో బ్రిటన్ చైనాకు అప్పగించనున్న హాంకాంగ్‌లో – చీనా సంగీత నాటకాల లోని పాత్రల ఊరేగింపు జరిపారు. ఆ ఊరేగింపులో ఎద్దు ఆకారంలో తయారు చేసిన బ్రహ్మాండమైనబెలూన్ ఒకదానిని తీసుకువెళ్ళారు!

## పొడవైన చాక్లెట్

స్వీడన్‌దేశంలోని జపాను హొటల్ ఒకటి ఫిబ్రవరి 17వ తేదీ 182 మీ॥ పొడవైన చాక్లెట్ తయారు చేసింది. అది గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో నమోదుకానున్న సమయంలో స్విట్జర్లాండులో అంతకన్నా పొడవైన చాక్లెట్‌ను తయారుచేశారు. ఆ చాక్లెట్ పొడవు 221 మీ॥ (725 అడుగులు). వెడల్పు 3 సెం.మీ. వరుసగా ఉంచిన బల్లల మీద దానిని పరిచారు. గిన్నీస్ సంస్థ అధికారులు వచ్చి చూసిన తరవాత దానిని చిన్న ముక్కలుగా కోసి 500 మంది చాక్లెట్ ప్రియులకు పంచారు!

## చారల గాడిదలు



'టైగాన్స్' గురించి మీరు విన్నారా? పులులు, సింహాలు కలిసిన సంకరజాతి 'పులి –సింహాలు' అవి. ఇప్పుడు గాడిదనూ – జీబ్రానూ కలిపి మరొక సంకరజాతి జంతువును విజయవంతంగా సృష్టించారు. లండన్‌లోని లియోమినిస్టర్ జూలోని రెండు చారల గాడిదలు చూపరులను ఆకర్షిస్తున్నవి, సుసీ పొలార్డ్ శిక్షణ నిస్తున్న ఈ గాడిదల కాళ్ళపై మాత్రమే చారలు కనిపిస్తున్నాయి!

చందమామ
అనుబంధం
102

మనదేశపు
అందచందాలు

# రాక్‌గార్డెన్స్

లండన్ నగరంలోని క్యూ గార్డెన్స్ అరుదైన మొక్కలకు ప్రసిద్ధిగాంచింది. మ్యాన్‌హాటన్‌లోని న్యూయార్క్ సెంట్రల్ పార్క్ –740 ఎకరాల ఉద్యానవనంతో, తటాకాలతో ప్రపంచంలోనే అతిపెద్ద ఉద్యానంగా పేరుగాంచింది. చండీఘడ్‌లోని రాక్ గార్డెన్ ఈ రెండింటికీ భిన్నమైనది. ఇది సహజ సిద్ధమైన శిలారూపాల నుంచి, పనికిరాని పీచు నుంచి మలిచిన దాదాపు 20,000 బొమ్మలు, ఆకారాలు గల విలక్షణమైన శిలా ఉద్యానవనం! అందమైన మార్గాలతో, అనుకోని మలుపులతో, చిత్రమైన వంతెనలతో ఈ గార్డెన్, లోపలికి వచ్చిన వారికి వింత అనుభూతిని కలిగిస్తుంది. విరిగిన అద్దాల గాజులనుంచి తయారుచేసిన ఎలుగుబంట్లు,గుర్రాలు, కోతులు, నెమళ్ళు ఉన్నాయి. నేక్‌చంద్ అనే మేధావి ఈ రాక్ గార్డెన్‌కు రూపకల్పన చేశాడు. ఆయన పద్మశ్రీ బిరుదు, రాష్ట్రపతి సన్మానం అందుకున్నాడు. రాజధానిలోని చిల్డ్రెన్స్ మ్యూజియంలో అద్భుతమైన ఒక ఉద్యానవనం సృష్టించమని 1985వ సం॥లో ప్రభుత్వం ఆయన్ని ఆహ్వానించింది. దేశ విదేశాల నుంచి వచ్చే యాత్రికులకు చండీఘడ్‌లోని రాక్ గార్డెన్ ఒక ప్రత్యేక ఆకర్షణ!



మనదేశపు ఋషులు:

# శుకదేవుడు

వేదాలను విభజించి, పంచమవేదంగా ప్రసిద్ధిగాంచిన మహాభారతాన్ని రచించిన వ్యాసమహర్షి కుమారుడు తపోధనుడైన శుకదేవుడు.

శుకుడు కొంతకాలం తండ్రి దగ్గర విద్యాభ్యాసం చేసి, ఆ తరవాత దేవగురువైన బృహస్పతి వద్ద శిష్యుడుగా చేరాడు. విద్యాభ్యాసం పూర్తయిన తరవాత, శుకుడుమళ్ళీ వ్యాసుడి వద్దకు వచ్చి, "నా విద్యాభ్యాసం పూర్తయింది. వేదవేదాంగాలను అధ్యయనం చేశాను. నిరంతరం ధ్యానంతో, సర్వసంగ పరిత్యాగిగా, నిర్వికారంగా కాలం గడుపుతున్నాను. అయినా నాకు అందులో సంతృప్తి కలగడం లేదు!" అన్నాడు.

"నువ్వు వివాహమాడి గృహస్థాశ్రమం స్వీకరించు నాయనా!" అన్నాడు వేద వ్యాసుడు.

"ప్రపంచంలో జన్మించి, వివాహం చేసుకుని, సంసార బంధాలు పెంచుకుని,నానా బాధలు అనుభవించి, ఆఖరికి మరణించే కోట్లాది జీవుల మామూలు జీవితం నాకు సంతృప్తి నివ్వదు!" అన్నాడు శుకదేవుడు.

ఆ మాటకు వెంటనే సమాధానం చెప్పక కొంతసేపు మౌనం వహించిన వ్యాసుడు, "నాయనా! నువ్వు ఒకసారి మిథిలకు వెళ్ళి జనక మహారాజును దర్శించి రా!" అని సలహా ఇచ్చాడు.

తండ్రి ఆనతి ప్రకారం, శుకుడు కాలి నడకనే మిథిలానగరానికి బయలుదేరాడు. పిలిచిన పలికే సేవకులమధ్య, సకల సౌభాగ్యాలతో, అంతులేని అధికారంతో తులతూగుతూన్న జనకమహారాజు దగ్గరికి తండ్రి తననెందుకు పంపాడా అని ఆలోచించ సాగాడు. కాని అతడు తీరా జనకుణ్ణి సందర్శించి, ఆయనతో సంభాషించి, అక్కడి పరిస్థితులను చూసిన తరవాత- జనకుడు మామూలు రాజు కాదనీ, రాజుగా తన బాధ్యతలు నిర్వహిస్తూనే, విరాగిలా తామరాకుపై నీటిబొట్టులా జీవితాన్ని సాగిస్తూన్న కర్మయోగి అని గ్రహించాడు!

సార్థకమైన మానవజీవితం సాగించడానికి జనకుడి జీవితమే ఆదర్శం అన్న తృప్తితో శుకదేవుడు తండ్రి వద్దకు తిరిగి వచ్చాడు.



# మీకు తెలుసా?

## సాల్మన్ చేప

మంచి నీటి మడుగుల మధ్య ఉండే పెద్ద పెద్ద పల్లపు ప్రాంతాలలో సాల్మన్ చేపలు పుడతాయి. ఈ మడుగులలో రెండేళ్ళుండి ప్రవాహం-గుండా సముద్రంలోకి చేరుతాయి. ఆ పైన కొన్నేళ్ళకు సంతానోత్పత్తి కోసం అవి మళ్ళీ తాము పుట్టిన చోటికే తిరిగి వచ్చి గుడ్లు పెడతాయి!



## ఇంద్రధనుస్సు



## విలక్షణమైన పక్షుల కేంద్రం

సింగపూర్‌లోని 'జురాంగ్ బర్డ్ పార్క్'లో దాదాపు 6,000 జాతుల పక్షులు ఉన్నాయి. ఎనభై లక్షల సింగపూర్ డాలర్ల వ్యయంతో దీనిని నిర్మించారు. ఇక్కడ ఐదు జాతుల 160 పెంగ్విన్లు, 6,000 జాతులకు చెందిన 8,000 పక్షులు ఉన్నాయి. నీటి పక్షుల కోసం కొన్ని తటాకాలూ, పచ్చిక ప్రదేశాలూ నిర్మించారు. అందమైన చెట్లు పెంచారు. పావురాలు, గూడకొంగలు (హార్న్‌బిల్స్) ఇబెరిత (పెలికాన్) పక్షులతో ఏర్పాటు చేసే 'ఆల్ స్టార్ బర్డ్ షో' జురాంగ్ పార్క్ ప్రత్యేకత!




# అత్యాశ

అచ్చన్న అనే అతడికి నాలుగెకరాల పొలం వున్నది. సక్రమంగా, సకాలంలోవానలు పడుతూండడంవల్ల, చాలా ఏళ్ళుగా పంటలు బాగా పండుతున్నాయి. అయినా అచ్చన్నకు సంతృప్తిలేదు. తను గొప్ప భాగ్యవంతుడు కావాలని అతడి కోరిక.

ఒకసారి అతడిఊరికిజ్ఞానయోగి వచ్చాడు. ఊరి వాళ్ళందరికీ మంచిచెడ్డలు బోధించాడు. అచ్చన్న ఆయనను కలుసుకుని మనుషుల్లో బీదా, గొప్పా తేడాలెందుకొచ్చాయనిఅడిగాడు.

"వారి వారి కర్మలనుబట్టీ, శక్తి సామర్థ్యాలనుబట్టీ, పరిస్థితులనుబట్టీ కొందరు గొప్పవారవుతారు. కొందరు పేదవారవుతారు," అన్నాడు జ్ఞానయోగి.

అచ్చన్న ఆయనను తను గొప్పవాడయ్యే ఉపాయం చెప్పమని కోరాడు.

యోగి అతణ్ణి వ్యాపారం చేయమన్నాడు. అచ్చన్న తనవల్ల కాదన్నాడు. ఏ కళల్లోనన్నా ప్రావీణ్యం సంపాదించమన్నాడు. అచ్చన్న తనకు చేతకాదన్నాడు. గొప్పవాడిని ఆశ్రయించమంటే, అచ్చన్న అది తనకు కానిపని అన్నాడు.

"నీకు భుక్తికి లోటులేదు. సుఖంగా వున్నావు. ఇంతకుమించి గొప్పవాడివి కావాలనుకోవడం అత్యాశ అనిపించుకుంటుంది, అది అంత మంచిది కాదు," అని జ్ఞానయోగి, అచ్చన్నకు హితబోధ చేశాడు.

"ప్రతివాడికీ గొప్పవాడవ్వాలని వుంటుంది. అది అత్యాశ కాదు. అదృష్టం కలిసిరావాలి, అంతే!" అన్నాడు అచ్చన్న, యోగిమాటలు లెక్కచేయకుండా.

"సమర్థత, స్వయంకృషి లేకుండా వచ్చిన అదృష్టం నిలబడదు. కేవలం అదృష్టంతో గొప్పవాడివి కావాలనుకోవడం అత్యాశే అవుతుంది. ఈ విషయం నమ్మకపోతే నీకు,

జొన్నలగడ్డ రామలక్ష్మి

నేనొక మంత్రం చెబుతాను. ఆ మంత్రం పఠిస్తే నీకు చోరదేవుడు ప్రత్యక్షమై, ఒక్క సారికి నువ్వు కోరినంత డబ్బు తెచ్చిస్తాడు," అన్నాడు జ్ఞానయోగి.

ఇలాంటి మాట వినాలనే జ్ఞానయోగిని కలుసుకున్న అచ్చన్నకు కళ్ళు పెద్దవయ్యాయి. అతడు తనకు వెంటనే మంత్రోపదేశం చేయమని జ్ఞానయోగిని ఎంతో బతిమాలు కున్నాడు.

"మంత్రోపదేశానికి ముందు నువ్వు చోర దేవుడి గురించి తెలుసుకోవాలి," అంటూ జ్ఞానయోగి అతడికి చోరదేవుణ్ణి గురించి చెప్పాడు:

బాగా వున్నవారినుంచి డబ్బును మాయం చేసి లేనివారికి చేర్చగలడు చోరదేవుడు. చోరదేవుడు మాయం చేసే డబ్బు న్యాయ మైన సంపాదన కాకపోవడం వలన – ఆ డబ్బు పోగొట్టుకున్నవాడు రాజుకు ఫిర్యాదు చేసుకోడు. చోరదేవుడిచ్చిన డబ్బు నెలరోజు లపాటు, పుచ్చుకున్నవాడికే తప్ప ఇంకెవ రికీ కనబడదు. కాబట్టి అంతవరకూ దానిని వాడడం వీలుకాదు. ఏ మనిషికైనా చోర దేవుడు ఒక్కసారి మాత్రమే ప్రత్యక్షమవుతాడు. ఒక్క కోరిక మాత్రమే తీర్చుతాడు. అత్యాశ ఉన్నవారికి ఆయన వల్ల ప్రయోజనం పొందే అవకాశాలు తక్కువ!

అంతావిని అచ్చన్న, జ్ఞానయోగిని తనకు మంత్రోపదేశం చేయవలసిందిగా కోరాడు. యోగి అతడికి మంత్రంచెప్పి, "రేపు తెల్లవారు ఝామునే లేచి స్నానం చేసి మంత్రంపఠించు. చోరదేవుడు నీకు ప్రత్యక్షమవుతాడు," అన్నాడు.



అచ్చన్న ఇంటికి వెళ్ళాడు. ఆ రోజంతా అతడికి మనసు మనసులో లేదు. రాత్రంతా నిద్రపట్టలేదు. మర్నాడు తెల్లవారు ఝామునే లేచి, త్వరగా స్నానంచేసి యోగి ఉపదేశించిన మంత్రం పఠించాడు.

వెంటనే అచ్చన్న ముందు ఒక నల్లటి వ్యక్తి ప్రత్యక్షమయ్యాడు. ఆయన శరీరం నూనె రాసుకున్నట్టు నున్నగా వుంది. కళ్ళకు గంతలున్నాయి. ఎత్తుగా, పుష్టిగా, మెలిదిరి గిన కండలతో వస్తాదులావున్న ఆ వ్యక్తి, "నేను చోరదేవుణ్ణి. ఎంత డబ్బు కావాలో కోరుకో!" అన్నాడు,

అచ్చన్న సంతోషం వర్ణించడం కష్టం. అతడు చోరదేవుడికి భయభక్తులతో దణ్ణం పెట్టి, "స్వామీ! నాకు కోటివరహాలు కావాలి!" అన్నాడు.



"సరే, ఇస్తాను. ఆ డబ్బంతా ఇక్కడ నేల మీద పోయమంటావా? లేక పెద్ద పెట్టెను సిద్ధంచేసి వుంచుతావా?" అని అడిగాడు చోరదేవుడు

"స్వామీ కొట్టు గదిలో పెద్ద భోషాణ మున్నది. ప్రస్తుతం అది ఖాళీగా వుంది. తమరు డబ్బును అందులో పోయవచ్చు," అన్నాడు అచ్చన్న.

"సరే, సూర్యోదయమైనాక వెళ్ళి భోషాణంలో చూసుకో!" అని చోరదేవుడు మాయ మయ్యాడు.

అచ్చన్నకు అంతా కలలావున్నది. బాల భానుడి లేతకిరణాలు తనమీద పడేదాకా, అతడు అసహనంగా ఇల్లంతా పచార్లు చేశాడు. తర్వాత వెళ్ళి చూస్తే, భోషాణంలో చెప్పలేనంత డబ్బున్నది. అంత డబ్బును చూడగానే అతడికి మతిపోయినట్టయింది. ఆ డబ్బుతో తనూ, తన కుటుంబం తరతరాల పాటు వైభవంగా జీవించవచ్చు నని సంతోషపడ్డాడు.

ఉన్నట్టుండి అచ్చన్న సంతోషం ఎందుకు పెరిగిందో, అతడి తల్లిదండ్రులకు కానీ, భార్యకుగానీ, కొడుకుక్కాగానీ అర్థం కాలేదు. తనకు మాత్రమే కనబడే ఆ డబ్బు గురించి, అప్పుడే అందరికీ చెప్పదలచుకోలేదు అచ్చన్న. నెలరోజులాగితే ఆ డబ్బు అందరికీ కనబడుతుంది కాబట్టి, ఆరోజునే చెప్పవచ్చు ననుకున్నాడు.

ప్రతిరోజూ అచ్చన్న కొట్టుగదిలోకి వెళ్ళి భోషాణంలో డబ్బును చూసుకుంటూండే వాడు. అంత డబ్బు తన భోషాణంలో చేరిం దని మురిసిపోయేవాడు. అలా రెండు వారాలు గడిచాయి. ఆ తర్వాత ఒక రోజున చూస్తే, భోషాణంలో ఒక్క వరహా కూడా లేదు.

అచ్చన్నకు గుండె ఆగినంత పనయింది. ఆ డబ్బును తను తప్ప ఇంకెవ్వరూ చూడ లేదు. అలాంటప్పుడది ఎలామాయమ యింది? జ్ఞానయోగి ఏదో మాయచేసి వుండాలి! చోరదేవుడిచ్చిన డబ్బు రెండు వారాలతర్వాత మాయమవుతుందని ఆయన తనకు చెప్పలేదు. అందుకుకారణం అడగాలి జ్ఞానయోగిని!

ఇలా ఆలోచించి అచ్చన్న తీరా వాకబు చేస్తే, వారంరోజులక్రితమే జ్ఞానయోగి ఊరు విడిచి వెళ్ళిపోయినట్టు తెలిసింది. ఆయన మధురాపురంవెళ్ళాడని ఎవరోచెప్పగా,అచ్చన్న వెంటనే ఆ ఊరుకు ప్రయాణ మయ్యాడు!

అచ్చన్న మధురాపురం పొలిమేరకు చేరుకునేసరికి, అతడికి అప్పన్న ఎదురై, "అరెరె, ఆడబోయిన తీర్థం ఎదురైనట్టు, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు, నువ్వే నాకు ఎదుర య్యావు. నేను నీకోసం మీ ఊరుకు బయలుదేరాను," అన్నాడు.

"నాతో నీకేం పని?" అని అడిగాడు అచ్చన్న ఆశ్చర్యంగా.

"మరిచిపోయావా? నా కూతుర్ని నీ కొడుక్కు చేసుకోమంటే, యాభైవేల వరహాలు కట్నం కావాలన్నావు. అప్పట్లో నా దగ్గర అంతడబ్బు లేదు. ఇప్పుడైతే లక్షవరహాలు కావాలన్నా ఇవ్వగలను. ఈ మాటచెప్పి సంబంధం స్థిరపరుచుకుందామని బయలు దేరాను. అయినా, నా కూతురుకు వేరే సంబంధం దొరకదని కాదు; నీ కొడుకు యోగ్యుడని ఇష్టపడుతు న్నాను," అన్నాడు అప్పన్న.

"ఒక్క సారిగా నీకంత డబ్బెలా వచ్చింది?" అని అడిగాడు అచ్చన్న అనుమానంగా.

"అంతా జ్ఞానయోగి దయ!" అన్నాడు అప్పన్న.

"మనం తర్వాత మాట్లాడుకుందాం. ముందు నేను జ్ఞానయోగిని చూడాలి," అన్నాడు అచ్చన్న.

అప్పన్న, అచ్చన్నను జ్ఞానయోగి వుండే చోటుకు తీసుకువెళ్ళాడు. ఆ సమయంలో జ్ఞానయోగి, ఆ ఊరు విడిచి మరొక ఊరు వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. ఆయన, అచ్చన్న గోడువిని, "అత్యాశకు పోవద్దంటే విన్నావు కాదు. అందుకే నీకు చోరదేవుడి వల్ల ప్రయోజనం కలగలేదు," అన్నాడు.

"అసలేం జరిగిందో చెప్పండి, స్వామీ!" అన్నాడు అచ్చన్న దిగులుగా.

"కోటి వరహాలు నీవద్ద చేరడంతో, నీవూ గొప్పవాడివై పోయావు. ఆ కోటి వరహాలూ



అన్యాయపుసొమ్ము. కాబట్టి, ఎవడైనా ఇంకొ కడు కోటి వరహాలు కోరివుంటే – చోరదేవుడు నీ డబ్బునే మాయంచేసి వుంటాడు.నువ్వు పదివేలో, ఇరవై వేలో కోరివుంటే చోరదేవుడి దృష్టిలోపడి వుండేవాడివికాదు. లేక ఎవరైనా కోటివరహాలు కోరకపోయినా, ఆ డబ్బునీకు దక్కేది. అయినా, అత్యాశాపరులు పెరిగి పోయిన ఈ రోజుల్లో, కోటివరహాలు కోరే వాడొక్కడైనా, చోరదేవుడికి తటస్థపడుతూనే వుంటాడు. కాబట్టి ఆ కోటి వరహాలూ అలా భోషాణాలు మారుతూనేవుంటాయి!" అన్నాడు జ్ఞానయోగి నవ్వుతూ.

ఈ మాటలు వింటూనే, "అయ్యో! నేనూ కోటి వరహాలే కోరాను. ఈ పాటికే నా డబ్బు మాయమయిందో ఏమో!" అంటూ అప్పన్న అక్కడి నుంచి తన ఇంటికి హడావుడిగా పరిగెత్తాడు.

"ఈ పాటిక్కాకపోయినా, ఇంకో వారంలో ఆడబ్బు గతీ అంతేకావచ్చు!" అంటూ జ్ఞాన యోగి అక్కడినుంచి వేరొక ఊరికి ప్రయాణ మయ్యాడు.

అచ్చన్న ఏం జరిగిందో చూద్దామని అప్పన్న ఇంటికి వెళ్ళేసరికి, అతడు ఖాళీగా వున్న దయ్యమంత పాతకాలపు భోషాణం ముందు రెండు చేతులతో తల పట్టుకుని నిలబడివున్నాడు.

సంగతి గ్రహించిన అచ్చన్న, అప్పన్న వీపు తడుతూ, "దిగులు పడకు, అప్పన్నా! మనిద్దర్నీ అదృష్టం పట్టినట్టే పట్టి వదిలి పోయింది. అత్యాశ కూడదని జ్ఞానయోగి ముందే నాకు హితవు చెప్పాడు," అన్నాడు ఉస్సురుమంటూ.

"నువ్వడిగిన కట్నం ఇచ్చి, నీ కొడుకును అల్లుణ్ణి చేసుకుందామని ఆశపడ్డాను. నా ఆశ దురాశ అయింది!" అంటూ అప్పన్న కూలబడ్డాడు.

అచ్చన్న అతణ్ణి చేతులు పట్టుకుని లేవనెత్తి, "మనిద్దరం అత్యాశకు పోయి నష్ట పోయిన వాళ్ళం. నా కొడుకును నీ అల్లుణ్ణి చేసుకోవాలనుకోవడం నీ దురాశ కాదు. దమ్మిడీ కట్నం లేకుండా, నీ కూతుర్ని నా ఇంటి కోడలుగా చేసుకుంటాను, సరా!" అన్నాడు.

ఆ మాటలు విన్న అప్పన్నకు, చోరదేవు డిచ్చిన డబ్బు ఇంకా భోషాణంలో వున్నంత సంతోషం కలిగింది.





# మహాబలులు

ఒక అరణ్యానికి సమీపంలో ఒక బలాఢ్యు డుండేవాడు. అతని పేరు శరభయ్య. ఆ శరభయ్య, ప్రపంచంలో తనను మించిన బలాఢ్యుడు లేడనుకునేవాడు. ఎందుచేత నంటే, అతను అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి, మామూలు కట్టెలమోపుకు పదింతలుండే మోపు కట్టి, దాన్ని ఇంటికి తెచ్చి, తన పెళ్ళాంతో, "నేను కలియుగ భీముణ్ణే! చూడు, ఎంత పెద్ద మోపు తెచ్చానో!" అనే వాడు.

"భీముడివా? నిజంగా భీముడెదురైతే పారిపోవూ? బలవంతుడివే, ఎవరు కాదం టారు? మహాబలుడివి మటుకుకావు," అనేది శరభయ్య భార్య దుర్గమ్మ.

ఈ మాట వినగానే శరభయ్యకు కోపం వచ్చి, "మాటలతో పనేమిటి? నా కన్న బలం గలవాణ్ణి చూపించు, అప్పుడు నమ్ముతా!" అనేవాడు.

ఒకనాడు దుర్గమ్మ నెత్తిన పెద్ద కుండ పెట్టుకుని, నీళ్ళు తేవటానికి బావికి వెళ్ళింది. ఆమె బావిలో చేద వేసి తోడబోతే అది విపరీతంగా బరువెక్కి పైకిరాలేదు. ఆమె ముచ్చెమటలు పోసేదాకా ప్రయత్నించింది. చివరకు ప్రాణం విసిగి, చేదను బావిలోనే వదిలేసి, ఖాళీ కడవ చంకన పెట్టుకుని ఇంటిదారి పట్టింది. ఆమె కాలిబాట వెంబడి నడుస్తూండగా, అరణ్యమార్గం నుంచి వచ్చే మరొక కాలిబాట మీదుగా ఇంకొక స్త్రీ, చంకన చంటిబిడ్డను పెట్టుకుని, చేత ఖాళీ కడవ పట్టుకుని, నీటికై బావి వద్దకు వస్తూ దుర్గమ్మకు ఎదురయింది.

"ఖాళీ కడవతో తిరిగి వస్తున్నావేం?బావి ఎండిపోయిందా ఏం?" అని రెండో మనిషి దుర్గమ్మ నడిగింది.

"లేదమ్మా, బావిలో వేసిన చేద పదిమంది పట్టి లాగితే గాని పైకి రాకుండా ఉంది.

25- ఏళ్ళనాటి చందమామ కథ

బావిలో ఏ భూతమో చేరినట్టుంది," అన్నది దుర్గమ్మ.

"అంతే కద. నా వెంట రా. నీకు కావలి సిన నీరంతా నేను తోడిస్తాను," అన్నదిరెండో స్త్రీ. ఆమె అయినా అంత పెద్ద బలంగాలేదు. కాని దుర్గమ్మ ఆ మనిషి వెంట బావికి వెళ్ళింది.

"ఇదుగో, చూడు, చేదను బావిలోనే వదిలేసి రావలిసి వచ్చింది. నీకు మాత్రం వస్తుందా?" అంటూ దుర్గమ్మ చేద తాడు పట్టుకుని పైకి లాగసాగింది.

ఇంతలో రెండోస్త్రీ చంకన ఉన్నచంటి పిల్లవాడు దుర్గమ్మ చేతిలో ఉన్నతాడు అందుకుని, గబగబా చేదనుపైకి లాగేశాడు. దుర్గమ్మ తన నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని నిర్ఘాంతపోయింది. ఆమె నోటమాట రాలేదు. కాని పిల్లాడి తల్లి మాత్రం ఏమీ ఆశ్చర్య పడలేదు.

ఆ చంటివాడు ఒక్క రవ్వయినా అలవ కుండా చేద తరవాత చేద తోడి పోస్తుంటే ఇద్దరు స్త్రీలూ చక్కగా స్నానాలు చేసి, తమ బట్టలు ఉతుక్కుని, కడవల నిండా నీరు నింపుకున్నారు.

ఇద్దరూ తిరిగి వచ్చేటప్పుడు దారులు చీలే చోట దర్గమ్మ ఆ రెండో స్త్రీ యొక్క పూర్వోత్తరాలు తెలుసుకున్నది.

"ఈ దారినే పోతే మా ఇల్లు వస్తుంది. మా ఆయన పేరు అపరభీముడు," అని చెప్పి రెండో స్త్రీ బిడ్డతో సహా వెళ్ళిపోయింది.

దుర్గమ్మ ఇంటికి వస్తూనే భర్తకు జరిగిన సంగతంతా చెప్పింది.

"ఈ ప్రాంతాల అపరభీముణ్ణని చెప్పు కుంటూ ఇంకొకడు తిరుగుతున్నాడా? ఉండు వాడిపని పట్టిస్తా!" అన్నాడు శరభయ్య.

"నీకు పుణ్యం ఉంటుంది. వాడి జోలికి పోకు. వాడు నిన్ను హతమారిస్తే నా పని



ఏం కాను? వాడి పసికొడుక్కే అంత బలం ఉంటే, వాడి కింకెంత బలం ఉండాలి?" అన్నది దుర్గమ్మ.

శరభయ్య పెళ్ళాం మాట చెవికెక్క నీక, "రేపు పొద్దున్నే వాడింటి దారి చూపించు. పై పని నేనుచూసుకుంటాను," అన్నాడు రోషంగా.

మర్నాడు అతను భార్యను వెంటబెట్టు కుని, తన విల్లంబులూ, కత్తీ తీసుకుని బయలు దేరాడు. అయితే ఈ అపరభీముడి సంగతి తేల్చుకునే ముందు, బావి సంగతి తెలుసుకుందా మనిపించి మొదట బావి దగ్గిరికే వెళ్ళాడు. సరిగా అదే సమయానికి అపరభీముడి భార్య కూడా అక్కడికి వచ్చింది.

శరభయ్య చేద లాక్కుని బావిలో వేసి, నీటిలో ముంచి, "ఈ ముష్టిచేద లాగటానికి పదిమంది కావాలిట!" అంటూ చేదను తోడబోయాడు. మూలిగి, ముక్కి, పళ్ళ బిగువున చేదను కొద్దిగా నీటి పైకి లాగాడు గాని, మరుక్షణం శరభయ్యను చేద బావిలోకి ఈడ్చింది. సమయానికి చంటివాడు శరభయ్యను పట్టుకోకపోతే శరభయ్య బావిలో పడి ఉండును.

తరవాత ఆ చంటిపిల్లవాడు శరభయ్య చేతి నుంచి చేదతాడు అందుకుని, సునాయాసంగా చేదను పైకి తోడేశాడు.

"ఇప్పటికైనా సంగతి తెలిసిందిగా? ఇక మాట్లాడకుండా ఇంటికి పద!" అన్నది దుర్గమ్మ తన భర్తతో.

"ఇందులో ఏదో గారడీ, కనుకట్టూ ఉన్నాయి. నే నా అపరభీముణ్ణి కలుసుకు తీరాలిసిందే!" అన్నాడు శరభయ్య.

"నీ రాత నేను తప్పించగలనా? నేను మాత్రం నీ వెంట రాను," అంటూ దుర్గమ్మ నీళ్ళు తీసుకుని ఇంటిదారి పట్టింది.

రెండో స్త్రీ శరభయ్యతో, "నా మాట విని నువ్వు కూడా ఇంటికిపో, నా మొగుడి





కళ్ళపడటం అంత మంచిది కాదు," అన్నది. కాని శరభయ్య మొండికెత్తి ఆమె వెనకనే వాళ్ళింటి దాకా వెళ్ళాడు.

"నా మొగుడు ఆహారం వేటాడబోయాడు. తడవ కొక ఏనుగును తినేస్తాడు. అందుచేత నువ్వు ఎక్కడైనా దాక్కుని, చాటు నుంచి ఆయన్ని చూడు, ఎదట పడ్డావో, నిన్ను అవలీలగా విరుచుకుతింటాడు," అన్నది అపరభీముడి భార్య. ఆమె శరభయ్యను నిలువెత్తు కడవలోకి దింపింది. అందులో శరభయ్య మునివేళ్ళమీద నిలబడితే గాని బయట జరిగేది కనబడదు.

సాయంకాలం అవుతుండగా పెద్ద సుడిగాలి వీచింది. అపరభీముడు తన ఇంటి ఆవరణలోకి వచ్చి, "ఏనుగును వండావుటే?" అని కేకపెట్టాడు. ఆ కేకకు అన్ని వస్తువులూ దద్దరిల్లాయి. శరభయ్య దాగి ఉన్న కడవకూడా కంపించింది. శరభయ్యకు వణుకు పుట్టుకొచ్చింది. తనకన్న మహాబలుడొకడున్నాడన్నది అతనికిప్పుడు స్పష్టంగా తెలిసిపోయింది.

"నీ ఏనుగు సిద్ధంగా ఉంది. వచ్చితిను," అని అపరభీముడి భార్య అన్నది.

"కొంచెం ఉండు. ఎక్కడి నుంచో మనిషి వాసన కొడుతున్నది. మనిషిని తిని చాలారోజులయింది," అంటూ అపరభీముడు తన ఇంటి చుట్టూ ఉండే అడివంతా గాలించటం మొదలుపెట్టాడు.

తన భర్త దూరం వెళ్ళగానే, అతని భార్య శరభయ్య దాక్కున్న చోటికి వచ్చి, నా భర్త వచ్చి తిండితిని, నిద్రపోతాడు. అప్పుడు నేను దీపాన్ని కిటికీలో ఉంచుతాను. నువ్వు పారిపోవటానికి అదే గుర్తు. మళ్ళీ ఈ ఇంటి చాయలకెన్నడూరాకు," అని హెచ్చరించింది.

"రాను తల్లీ, రాను. నాకు బుద్ధి వచ్చింది!" అన్నాడు శరభయ్య.

ఒక రాత్రివేళ శరభయ్యకు కిటికీలో దీపం కనిపించింది. అతను మెల్లగా కడవలో నుంచి బయటికి వచ్చి, వేగంగా నడిచి వెళ్ళిపోసాగాడు.

అతనుకొద్ది దూరం వెళ్ళాడో లేదో పెద్ద సుడిగాలి లేచింది. "మనిషి వాసన! మనిషి వాసన!" అన్నమాటలు వినిపించాయి. అపరభీముడి గొంతు శరభయ్య గుర్తించి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు.

శరభయ్య ఎంతసేపు పరిగెత్తినా అపరభీముడు వెంట తరుముతూనే ఉన్నాడు. సుడిగాలి వీస్తూనే ఉంది. శరభయ్య కాళ్ళలో సత్తువ ఉడిగిపోయినా, గాలితోపుకు అతను

ముందుకు పోతున్నాడు. అతను అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తుతూ ఉండటంచేత ఎంత దూరం వెళ్ళినా జనసంచారం తగలటంలేదు.

ఇంతలో శరభయ్యకు ఒక దృశ్యం ఎట్టె దట కనిపించి, పై ప్రాణాలు పైనే ఎగిరి పోయినంత పనిఅయింది. అరణ్యమధ్యంలో ఒక మహాకాయుడు అరణ్య మృగాలను ఒక పెద్ద గుట్టగా పోసి, వాటిని పీక్కుతింటూ ఎముకలను ఒక పక్కకు విసిరి వేస్తున్నాడు.

"ఎవరునువ్వు? ఎవరు నిన్ను తరుము కొస్తున్నారు?" అని మహాకాయుడు శరభయ్యను అడిగాడు.

"ఒక మహాబలుడు!" అన్నాడు శరభయ్య వణికిపోతూ.

మహాకాయుడు కోపంతో హుంకరించి, "అడివి రాక్షసుణ్ణి నేనుండగా మరో మహాబలుడా! రానీ, వాడి ప్రాణాలు తీస్తాను," అని గర్జించాడు.

ఇంతలోనే అపరభీముడు దగ్గరికివచ్చాడు. అతనితో వచ్చిన సుడిగాలి శరభయ్యను పైకి ఎగరగొట్టేసింది. దానితో అతను ఎగిరి ఒక చెట్టు కొమ్మల మధ్య చిక్కుకున్నాడు. అక్కడి నుంచి అతను అతి దారుణమైన మహాబలుల యుద్ధం కళ్ళారా చూశాడు. ఇద్దరు మహాబలులూ కొంచెంసేపు ఒకరి కొకరు ఎదురుగా నిలబడి చూసుకుని, తర వాత కలియబడ్డారు. వాళ్ళు ఒకళ్లనొకళ్ళు తన్నుకున్న తన్నులకూ, గుద్దులకూ కొండలు కూడా పిండి అయిపోవలిసిందే.

తెల్లవారిన దాకా ఇద్దరు మహాబలులూ ఇలాగే యుద్ధం చేసుకున్నాక, కూడబలుక్కున్నట్టు, ఇద్దరూ ఆకాశంలోకి ఎగిరి మబ్బుల చాటుకు వెళ్ళిపోయారు. కాని అప్పటికీవాళ్ళ గర్జనలూ, తన్నులూ శరభయ్యకు వినిపిస్తూనే ఉన్నాయి.

వారిలో ఎవరు గెలుస్తారో చూద్దామని శరభయ్య ఎంతోసేపు చూశాడుగాని వాళ్ళు తిరిగి భూమికి దిగి రానేలేదు. చివరకు అతను చెట్టుదిగి, దారివెతుక్కుంటూ ఇంటికి చేరుకున్నాడు.

అటు తరవాత శరభయ్య ఎన్నడూ తన బలం గురించి, భార్యతో గాని, ఇతర్లతో గాని గొప్పలు చెప్పుకోలేదు. ఆ ప్రాంతాల వాళ్ళు మబ్బులు ఉరిమి నప్పుడల్లా, "మహాబలులింకా యుద్ధం చేస్తూనే ఉన్నారు," అంటారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

**ఈ పోటీల వ్యాఖ్యలు 1997 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.**



S.G. SESHAGIRI



S.G. SESHAGIRI

✱ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ ఏప్రిల్ నెల **15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## ఫిబ్రవరినెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకటికి ఒకటి తోడు!

రెండవ ఫోటో : బోనులో పులిపిల్లల గోడు!!

పంపినవారు : తోపుగుంట మస్తాన్‌బాబు,
**23/703**, సఖిలవారి వీధి,
ఫత్తేఖాన్ పేట – నెల్లూరు **–524 003** (ఆం.ప్ర)




Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.